

అంతర్జాతీయ తెలుగు సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకవర్గం:
సంపాదకుడు:
లయన్ కె.వి.గోవిందరావు
బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,
వి.బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎల్.

సభ్యులు
కె.వి.ఎస్.శరత్ బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,
కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,
కె.రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| 3 సంవత్సరాల చందా | రూ. 120/- |
| సంవత్సర చందా | రూ. 42/- |
| ఎయిర్ మెయిల్ (1 సం॥) | రూ. 200/- |
| సీ మెయిల్ (1 సం॥) | రూ. 100/- |

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9,దేశికారోడ్, మైలాపూర్, మద్రాసు-600004
ఫోన్.73327

# ఈ సంచికలో
## ఏప్రిల్ - 1992



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
జగ్‌మోహన్

తెలుగు 'విస్‌డమ్'కు ఇది 11వ సంవత్సర

## ధ్యానం

### జీవితం వెగటైనప్పుడు




లౌకిక సుఖానుభవం మాధుర్యం అని అనిపించినప్పుడు మానవుడు అంతకంటే విశిష్టమైన అనుభవాలకు ఉద్యమించడు. లోకం అభిలషించే అధికారం, ధనం, కీర్తి, గౌరవం అన్నీ జీవితంలో సమకూడినప్పుడు అన్యథా ఆలోచించడు. అదృష్టవంతుడనని సంతృప్తిపడతాడు. కానీ ఆ మధుర భావాలు కటువుగా మారినప్పుడు వెంటనే విచారంతో అంతకంటే ఉత్తమమైన వాటి కోసం ఉద్యమం ప్రారంభిస్తాడు. లౌకిక సుఖం లోపించినప్పుడు సర్వోత్కృష్టమైన పారమార్థిక సౌఖ్యం ఆకాంక్షిస్తాడు. జీవితం వెగటుగా తోచినప్పుడు పుణ్యంకోసం పాటు పడటం సహజం. వాస్తవానికి ఆకాంక్ష అనేది పశ్చాత్తాపజనితమైన ఒక అపూర్వ శక్తి. ఈ శక్తితోనే మానవుడు అపవర్గ (మోక్ష) సౌఖ్యాన్ని అందుకోగలుగుతున్నాడు. భ్రమ పోయినప్పుడు యదార్థం గోచరిస్తుంది.



## సంపాదకుని పేజీ

### వాస్తవమైన విద్య

మానవుని మనస్సులో అపూర్వమైన శక్తులు గూఢంగా దాక్కుని ఉంటాయి. ఈ శక్తులను గ్రహించి ప్రతీ వ్యక్తి ఇతోధిక సామరస్యంతో వృద్ధిచెందడం విద్య కానీ పరీక్షలో పాసవడానికి ఏవో కొన్ని ప్రాతిపదిక విషయాలను గ్రహించడం విద్యకాదు. నేర్చుకోవడం ఒక అభ్యాసంగా ఏర్పరచుకోగల మనోభావం ఇది. దీనిని అభివృద్ధి చేసుకోవడం ముఖ్యం ఇది ఒక అలవాటుగా, సహజ స్వభావంగా మారిపోవాలి. విద్య అనేది నిరంతరం మానసికాభివృద్ధికి తోడ్పడుతుంది.

విద్యయొక్క ముఖ్యపాత్ర ఏవేవో కొన్ని ప్రాతిపదిక విషయాలను తెలియజేయడం కాదు. ప్రజలను మరింత వివేకవంతులుగా, ప్రయోజనకారులైన పౌరులుగా తీర్చిదిద్దాలి. విద్యావంతులు సామాన్య జనానీకాన్ని శాంతి భద్రతలతో దేశానికి ఉపయుక్తంగా ఉండేటట్లు తయారుచేయాలి ప్రజాపాలిత రాజ్యంలో విద్యావంతుల అవసరం ఎంతైనా ఉంటుంది. ఓటర్లు సరియైన అభ్యర్థికి ఓటువేయాలి. దేశంలో విద్యా విధానం సక్రమపద్ధతిలో ప్రవృద్ధి చెందినప్పుడే ఇది సాధ్యం అవుతుంది.

విద్య ప్రతీ వ్యక్తిలోను గుప్తమై ఉన్న అతీత శక్తిసామర్థ్యాలను ప్రదర్శింపజేసేటట్లుగా ఉండాలి. శీలాభివృద్ధిని పెంచుకుంటూ సమాజానికి, సంఘానికి, దేశానికి సమర్పణభావంతో హృదయ పూర్వకమైన సేవచేయాలి ఇంతవరకూ మనం అభ్యసించిన విద్య ఆహార సమస్యలను గానీ, గృహ సమస్యలనుగానీ, నిరుద్యోగ

"శక్తిని గుర్తించటానికి రూపమే ఆధారం. అంతటా ఉన్న దైవం శరీరంతో రావడానికి కారణం అదే!" — అమ్మ

సమస్యలనుగానీ ఎంతమాత్రం సాధించలేక పోయింది. ఈ విద్య సంకరజాతి విద్య. మన సాంప్రదాయాలతోగానీ, ఆచారాలతోగానీ ఎంత మాత్రం సంబంధంలేని విద్య



దేశానికి విచ్ఛిత్తిని కలిగించే బూటకపు విద్య చారిత్రక ప్రసిద్ధులైన మన పూర్వుల మనస్తత్వాన్ని గ్రహించలేకపోయింది కాబట్టి నేడు నిరక్షరాస్యులైన పురుషులు, స్త్రీలు విద్యావంతులైన వారికంటే జ్ఞానవంతులుగా కనిపిస్తున్నారు. మన సాంప్రదాయక విద్య, సంగీతం, కళ, శిల్పం అత్యద్భుతమైనది తూర్పు, పశ్చిమ సంస్కృతులు ఏకమై ప్రవృద్ధి చెందుతున్న భారతభూమిని విద్యార్థులు, ఉపాధ్యాయులు సంపూర్ణంగా గ్రహించి అర్థంచేసుకోవాలి. విద్యకు సంబంధించిన సమస్యను ప్రత్యేకంగా అతి జాగ్రత్తగా సాధించాలి.

## ప్రథమ శ్రేణి ఎయిర్‌పోర్ట్‌లలో బొంబాయి,

ప్రయాణీకులు మరియు సరకుల రవాణాలను బట్టి ప్రథమశ్రేణికి చెందిన మొదటి 100 ఎయిర్ పోర్టులలో బొంబాయి, ఢిల్లీ కూడా చేరతాయి ఆసియా దేశపు పసిఫిక్ ప్రాంతంలో 16 ఎయిర్ పోర్టులు మాత్రమే మొదటి 100 లో ఉన్నాయి.

## వైద్యరంగం

### దంతాలను శుభ్రపరచడానికి అల్ట్రా సౌండ్ సాధనం

నోటిలో పండ్ల మీద పాచిని, గారను తీసి శుభ్రం చేయడానికి అల్ట్రాసౌండ్‌తో పనిచేసే సాధనం యు ఎస్ ఎస్ ఆర్ మాస్కోలో రీసెర్చి

రూపొందించబడింది ఎలక్ట్రోఅకౌస్టిక్ కన్‌వెర్టర్ మరియు జనరేటర్ జనింపజేసే విద్యుత్తుకి మధ్య గల అంతరం (margin) ఈ సాధనాన్ని అతి తక్కువగా వేడి చేస్తుంది దీనివల్ల దంత వైద్యుడు సాంప్రదాయక విధానాల కంటే ఈ విధానాన్ని ఉపయోగించి ఒకే సమంగా పళ్ళను శుభ్రం చేయ గలుగుతున్నాడు.

### కంటి శస్త్ర చికిత్సలకు క్రొత్త పరికరాలు

యు ఎస్ ఎస్ ఆర్ మెడికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో నిపుణులచే కంటి శస్త్ర చికిత్సలకు సరిక్రొత్త పరికరాలు సృష్టింపబడ్డాయి ఈ పరికరంలో కంటికి సంబంధించిన మైక్రో సర్జరీకి అవసరమైన సదుపాయాలన్నీ ఉంటాయి సూక్ష్మదర్శిని క్రింద శస్త్రచికిత్స చేయవచ్చు శస్త్ర చికిత్స వల్ల కలిగే ట్రామాలను తగ్గించవచ్చు. వైద్యరంగంలో అటువంటి పరికరాలలో ఇదే మొట్ట మొదటిది

### సాకిరెన్ కాన్సర్‌కి కారణం కావచ్చు

యునైటెడ్ స్టేట్స్ ఫుడ్ అండ్ డ్రగ్ అడ్మినిస్ట్రేషన్ అధికారుల విజ్ఞానశాస్త్ర సమ్మతమైన సమాచారాన్ని బట్టి కృత్రిమంగా తియ్యదనానికి ఉపయోగించే సాకిరెన్ (Saccharin) కాన్సర్‌కి కారణం కావచ్చుని తెలుస్తూంది జంతువుల మూత్రకోశంలో సాకిరెన్ వల్ల కంతులు బయలుదేరుతున్నాయని వివిధ పరీక్షలు తెలియజేసాయి

'మనిషి ధర్మమార్గావలంబనకు ఆధ్యాత్మిక చింతన అవసరం."

## సుప్రసిద్ధ

# రవీంద్రనాథ్ ఠాగూర్

రవీంద్రనాథ్ ఠాగూర్ కలకత్తా దగ్గర జొరాసంకో అనే గ్రామంలో 1861లో ఠాగూర్ కుటుంబంలో జన్మించారు వీరిది ఒక సంస్కార వంతమైన కుటుంబం వీరు మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ కనిష్ఠ పుత్రుడు. ఠాగూర్ ఇంట్లోనే ఉపాధ్యాయుల వద్ద విద్య నేర్చుకున్నారు. తరువాత ఒక సంవత్సరం పాటు లండన్ యూనివర్శిటీ కాలేజీలో చదువుకున్నారు. వీరు 7వ సంవత్సరం వయస్సులోనే ఇంగ్లీషులో పద్యాలు వ్రాయడం ప్రారంభించారు.



Rabindranath Tagore

ఠాగూర్ పద్యాలు సాధారణంగా 'భారతి' అనే బెంగాలీ సాహిత్య పత్రికలో ప్రచురింప బడేవి. వీరు 1885లో 'బాలక్' అనే పిల్లల పత్రికకు ఎడిటర్‌గా నియమింపబడ్డారు తరువాత వీరు 'సాధన' మరియు 'బంగ దర్శన్' అనే పత్రికలకు సంపాదకత్వం వహించారు

ఠాగూర్ సుప్రసిద్ధ భారతీయ సాంప్రదాయక విధానంలో రచనలు సాగించారు వీరు ఆంగ్ల భాషలో 1912లో రచించిన 'గీతాంజలి' యూరప్‌లోను మరియు అమెరికాలోను పండితు లను, శిష్టులను రంజింపజేసింది. 1913 నవంబరులో వీరి ఈ సాహిత్యానికి నోబెల్ బహుమానం ఇవ్వబడింది

ఠాగూర్ అనేక నవలలు, నాటకాలు, కావ్యాలు, కథాసంపుటాలు, సాహిత్య సమీక్షలు, ప్రహసనాలు రచించిన గొప్ప నవలాకారుడు, నాట్య కారుడు, వ్యాసరచయిత, గొప్ప గీతికా స్రష్ట. వీరు వ్రాసిన నాటకాలలో వీరే నటించేవారు వీరి సంగీతాన్ని "రవీంద్ర సంగీత్" అంటారు వంగభాషలో, చరిత్ (వ్యవహారిక) భాషలో ఎన్నో నూతన వాక్య రచనా పద్ధతులను ప్రవేశ పెట్టిన కవీంద్రుడు.

వీరు చిత్రకళను స్వీకరించి సుమారు 3,000 చిత్రాలను వినూత్న విధానాలలో చిత్రించారు. వీరు ఆధునిక భారతదేశంలో సృజనాత్మక చిత్రకారులలో ప్రఖ్యాతిపొందినవారు.

ఠాగూర్ రచనలు ప్రపంచంలోగల ముఖ్య మైన అన్ని భాషలలోకి అనువదింపబడ్డాయి. భారతదేశంలోను, పాశ్చాత్యదేశాలలోను లక్షలాది ప్రజలను ఇవి సంతోషపరచి సమ్మోహ పరచాయి గీతాంజలి, చైతాలి, మాలినీరాజా ఓ రాణి, గోరా, మానసి వీరి ముఖ్యమైన రచనలు

ఠాగూర్ అనేక దేశాలు పర్యటించి శాంతి నికేతన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు ఇక్కడ వీరు 1901 డిసెంబరులో ఒక పాఠశా లను స్థాపించారు. ఈ పాఠశాల ప్రాచీనకాలపు ఆశ్రమ పాఠశాలకు ప్రతిరూపంగా రూపొందించ

"కేవలం విగ్రహారాధనే కాదు, నైతిక విలువలను హృదయపూర్వకంగా ఆచరించడం మానవధ్యేయం."

బడింది. క్రమక్రమంగా ప్రపంచంలో ... వివిధ సంస్కృతులకు, కళలకు అంతర్జాతీయ యూనివర్శిటీ విశ్వభారతిగా అభివృద్ధిపొందింది.

వీరి కవిత్వం ఎంత అంతర్జాతీయ వాదంతో కూడుకుని ఉన్నా ఈ శతాబ్ది ప్రారంభంలో లేచిన వంగ విభజన కాలంలో స్వదేశీ ఉద్యమానికి ఆయన మొగ్గి అనేక దేశీయ గీతాలతో,



Devendranath Tagore

పాటలతో ప్రజానీకాన్ని ఉత్సాహపరచి స్ఫూర్తి కలిగించారు. వీరు రచించిన 'జనగణమన' జాతీయగీతం మొట్టమొదటి పర్యాయం 1911లో కలకత్తా కాంగ్రెస్ సమావేశంలో పాడబడింది 1915లో ఆంగ్లేయ ప్రభుత్వం వీరికి నైట్ (Knight) బిరుదునిచ్చి గౌరవించారు పంజాబ్ జలియన్‌వాలా బాగ్‌లో ఘోర హత్యకు, లక్షలాది దేశీయ ప్రజలను భయభ్రాంతులలో అణచివేసినదానికి నిరసన తెలియజేస్తూ 1919 మే 30వ తేదీన వీరు దీనిని వదులుకున్నారు

ఠాగూర్ 40 సంవత్సరాలపాటు పాఠశాల ఉపాధ్యాయులుగా సంతృప్తితో గ్రామీణ పరిసరాలలో వినయవంతమైన జీవితాన్ని కొనసాగించారు. ఏ ఇతర జాతీయ సంస్థలు తీవ్రమైన ఉద్యమాలు ప్రారంభించకముందే వీరు మొట్టమొదట తమ పాఠశాలలో గ్రామీణ ...వృద్ధికి ప్రయోగాలు ప్రారంభించారు.

ఇతరులు అనేక శతాబ్దాలు తీసుకునే బెంగాల్ అభివృద్ధిని వీరు ఒక్క జీవిత కాలంలో తీసుకువచ్చారు. మహాత్మాగాంధీ వీరిని గొప్ప సెంటినెల్ (Great sentinel) అన్నారు. వైవిధ్యం ఆయన కళ యొక్క జీవనం, ఆయన జీవనం యొక్క కళ (Variety was the life of his art and the art of his life ) వీరి రచనల వివిధ స్వరూపాలకు



Jorasanko House

వెనుక వీరి సందేశం సదా మౌనంగా ప్రతిధ్వనిస్తూంటుంది. ఇది వీరి మానవాతీతమైన అనంతతత్త్వం, విశ్వైక్య తత్త్వం. దుఃఖం జీవితాన్ని జయించరాదు. అందుకేవారు 'నా ఆశ్రమంలో దుఃఖం అనేది ఉండరాదు అది గీత, నృత్య, నాటకాల ద్వారా నిరోధించబడాలి' అన్నారు వీరి పాండిత్యం అంతా మానవతకు విశాలదృక్పథంతో ఉన్నత పరివర్తనకు తోడ్పడింది విశ్వైక మానవ ఆదర్శాన్ని సాధించడానికి వీరు జీవించి జీవితాన్ని ధారపోసారు

వీరు 1941లో 80వ సంవత్సరం వయస్సులో మరణించారు




"నేడు అణుబాంబు కన్నా జన విస్ఫోటనమే భయానకం అనిపిస్తుంది."

# టీ కథ

ఇందిరా మాన్‌సింగ్

భారతదేశం ఉత్పాదించే టీ వైవిధ్యానికి, విశిష్టతకు ప్రసిద్ధి పొందింది పశ్చిమ బెంగాల్ డార్జిలింగ్ సువాసన టీ మిక్కిలి నాణ్యమైనది - ముఖ్యంగా ఇచ్చటి మంచుతో కూడిన హిమాలయా పర్వత వాతావరణ పరిస్థితులవల్ల మరియు ఈ ప్రదేశంలో భూసార రచనా విధానం వల్ల ఇక్కడ ఉత్పత్తి కాబడే టీకి ప్రత్యేక రుచి, సువాసన సిద్ధిస్తుంది



భారతదేశంలో టీ వ్యవసాయం ప్రాతిపదికగా అనేకమందికి జీవనోపాధిని కలిగిస్తుంది. ఈరంగంలో సుమారు 2 మిలియనుమంది ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ శ్రామికులు ఉన్నారు. వీరిలో 50 శాతం స్త్రీలు వీరిలో చాలామంది సమాజంలో పేదకుటుంబాలకు చెందినవారు.

4వ శతాబ్దంలో ఒక చైనా వైద్యుడు టీ ఆకులను త్రుంచి, ఎండబెట్టి, ఒక ప్రత్యేక ఉష్ణోగ్రతకు వేడిచేసి, వేడినీటిలో నానబెట్టగా వచ్చిన చేదు డికాక్షను వైద్య పరిశోధనకు త్రాగాడు. ఈ టీ డికాక్షను త్రాగినందువల్ల పొందే ఉత్సాహాన్ని, ఆనందాన్ని ఇతడు మొట్ట మొదట గ్రహించాడు. 15వ శతాబ్దంలో నాగరిక ప్రపంచంలో టీ త్రాగడం ప్రారంభమైంది. 17వ శతాబ్దంలో ఈస్ట్ ఇండియా కంపెనీ వినిమయ పద్ధతిలో బట్టలు, వెండికి మరియు అనధికార యుక్తంగా నల్లమందుకు బదులుగా టీని చైనానుండి దిగుమతి చేసుకునేది

చాలాకాలం తరువాత 1823 లో బ్రిటన్‌కు చెందిన బ్రూస్ సోదరులు అస్సాంలో దేశీయ టీని కనిపెట్టినప్పుడు భారతదేశంలో టీ ఉత్పాదన ప్రారంభమైంది వీరు విస్తారంగా టీ ప్రవృద్ధి చెందే ప్రదేశాలు కనుగొన్నారు ఇవి శింగ్‌ఫో (Singpho) జాతులు తోటల పెంపకంలో మిగిలినవై ఉండవచ్చు. ఈ కొండ ప్రదేశాలలో జనులు టీ ఆకులతో చేసిన నాటు సారాను త్రాగుతూ ఉండేవారు.

మొట్టమొదట 1838లో దిబ్రుఘర్ నుంచి ఎనిమిది టీ పెట్టెలు ఎగుమతి చేయబడ్డాయి

## మందుల వ్యసనానికి అలవాటు పడ్డవారు బ్రిటన్‌లో అధికం

*బ్రిటన్‌లో మత్తుమందుల వ్యసనానికి లోబడిన వారు 50,000 మందికి పైగా ఉన్నారని అధికార పూర్వకమైన లెక్కల వల్ల తెలుస్తూంది. కానీ పత్రికలు వీరి సంఖ్య అధమం దీనికి అయిదురెట్లు ఉంటుం దని అంటున్నారు మత్తు మందుల వ్యసనం వల్ల మరణించేవారి సంఖ్య ఏనాటి కానాడు పెరిగి పోతూంది మత్తుమందులలో తీవ్రమైన హెరాయిన్ (Heroin) ను 60 శాతం వ్యసనదారులు ఉపయో గిస్తున్నారు.*

"స్వప్రయోజనం అంతరిస్తే మానవత్వంలో ఏకత్వం గోచరిస్తుంది."

ఈ బ్లాక్ టీ సౌచోంగ్ (Souchong) మరియు పీకో (Pekoe) అని రెండు గ్రేడులుగా చాలా ప్రసిద్ధిపొందింది. లండన్‌లో చాలా 'విశిష్టం' (Excellent) అని దీనిని వారు అభిలషించారు.

చైనాతో 1833లో ఈస్ట్ ఇండియా కంపెనీ గుత్తాధిపత్య వ్యాపార సంబంధాలు చెడిపోయినప్పుడు ఇంగ్లండు భారతదేశంలో టీ ఉత్పాదనకు తీవ్ర ప్రయత్నాలు ప్రారంభించింది. 1860 నాటికి భారతదేశంలో టీ ప్లాంటేషన్ తోటలు బాగా అభివృద్ధి చెందినప్పుడు ఇక్కడే టీ ఉత్పాదన సుమారు ఒక మిలియను కి.గ్రా.లు ఉండేది.



చైనా నుండి బ్లాక్ మరియు గ్రీన్ టీ రకాల విత్తనాలను లార్డ్ మెకార్టెనీ తెప్పించి భారతదేశంలో 1793లో కలకత్తా బొటానికల్ గార్డెన్స్‌లో ప్రవేశపెట్టాడు. ఇవి పశ్చిమ బెంగాల్ కచార్ మరియు నీలగిరి ప్రదేశాలలో నాటబడ్డాయి. నేడు భారతదేశంలో సగానికి సగం టీ మొక్కలు ఆ తోటల పెంపకానికి చెందినవే. ఆ తరువాత అనతి కాలంలో 1860కి చైనా టీ ఇక్కడి వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా ప్రవృద్ధిపొందింది.

నేడు అస్సాం, పశ్చిమబెంగాల్, తమిళనాడు, కేరళ భారతదేశంలో టీని అధికంగా ఉత్పాదించే రాష్ట్రాలుగా ప్రసిద్ధిపొందాయి. ఇవి మొత్తం సుమారు 98 శాతం టీని ఉత్పాదిస్తున్నాయి. భారతదేశపు టీ ఉత్పాదక ప్రదేశాలలో త్రిపుర, కర్ణాటక, మణిపూర్, సిక్కిం మరియు అరుణాచలప్రదేశ్ ముఖ్యపాత్రను వహిస్తున్నాయి. భారతదేశంలో సుమారు 13,300 టీ ఎస్టేట్లు ఉన్నాయి. వీటిలో 1200 బ్రహ్మాండమైన పెద్దతోటలు. డార్జిలింగ్ (పశ్చిమబెంగాలు) అస్సాం (నార్త్ ఈస్టర్న్ మైదానాలలో) మరియు దక్షిణాదిని భారతదేశపు నీలగిరి రకాలు నీలగిరి కొండలలోను భారతదేశపు ఉత్తమ రకం టీ ఉత్పాదింపబడుతుంది.

టీ సతత హరితపు మొక్క. దీనికి వర్షపాతం అధికంగా ఉండాలి. అప్పుడే ఇది సమృద్ధిగా పుష్కలంగా పెరుగుతుంది. దిగుబడి అధికంగా ఉంటుంది. సంవత్సరానికి కనీసం 90'' వర్షపాతం ఉండాలి సముద్రమట్టానికి ఎత్తుగా ఉండే ప్రదేశాలలో పెరిగే టీ ఉత్తమమైనది. కానీ మైదానాలలో పెరిగే టీ వల్ల అధిక ఫలసాయం వస్తుంది.

టీని రెండు మూడు ఫ్లష్‌లలో (Flushes)

---

## వాస్తవ విజ్ఞానానికి ప్రథమ సోపానం

*మన అజ్ఞానాన్ని గురించి మనం తెలుసుకోవడమే వాస్తవ విజ్ఞానానికి ప్రథమ సోపానం అని సోక్రటీస్ నిర్వచించాడు. మొట్టమొదట మనం ఇతరుల అజ్ఞానం గ్రహిస్తేగానీ వారికి మన విద్వాన్నైవుణ్యాన్ని గ్రహింప చేయలేం అని కోల్‌రిడ్జ్ నిర్వచించాడు.*

*"ప్రావీణ్యత" ఒక శక్తి క్రియాశక్తి ప్రావీణ్యత అనిపించుకోదు అది అనుకూల అవకాశం మాత్రమే శక్తివంతమైన క్రియాశీలత ప్రావీణ్యతతో కూడినప్పుడు వాస్తవిక విజ్ఞానం అవుతుంది అన్నాడు బేకన్*

*-టి.డబ్ల్యు పామర్*

'ఇతరుల బుద్ధితక్కువ చూడడం కాదు
నీ తెలివిలేనితనాన్ని పరిశీలించుకో''

కోస్తారు. మొదటి ఫ్లష్ మార్చి ఏప్రిల్‌లో జరుగుతుంది. మే-జూన్ ఫలసాయాన్ని గోల్డెన్ ఫ్లష్ అంటారు ఈ కాలంలోనే ఉత్తమమైన టీ లభిస్తుంది కొన్ని డార్జిలింగ్ టీలకు సకాలంలో కిలో గ్రాముకి 60 మొదలు 100 డాలర్లు ధర కిడుతుంది.

చైనా మరియు జపాన్‌లలో టీ త్రాగడం విస్తారమైన తంతుతో కూడిన ఒక గొప్ప ఉత్సవం (టీ సెరిమనీ)గా పరిణమించింది అక్కడ టీ డికాక్షను తీసి పంచదార, పాలు కలపకుండా త్రాగుతారు యూరప్ రష్యాలో పాలు కలపకుండా త్రాగుతారు ఒక్కొక్కప్పుడు నిమ్మరసం, పంచదార కలిపి త్రాగుతారు యు.ఎస్.ఎలో సామాన్యంగా టీలో ఐస్ వేసి పంచదారతో త్రాగుతారు. భారతదేశంలో, యు.కె.లో దాంట్లో పాలు, పంచదార కలిపి త్రాగుతారు. ఆఫ్రికాలో టీని చాలాసేపు నీటిలో మరగనిచ్చి తీసిన డికాక్షన్‌ను చిలికి నురగగా తయారుచేసి త్రాగుతారు. టిబెటియనులు గ్రీన్ టీని ఉప్పు మరియు యాక్ వెన్నతో కొయ్య కప్పులలో త్రాగుతారు పశ్చిమ ఆసియాలో టీని ఏలక్కాయలతో కలిపిన డికాక్షన్‌తో త్రాగితే బ్లాక్ లేక గ్రీన్ టీని ఏలక్కాయలు, కొట్టిన బాదంపప్పు కలిపి కహ్వా (Kahwa) అని కాశ్మీరులు త్రాగుతారు. ఇది చాలా పుష్టికరమైన రుచికర పానీయం.



## వెలుతురు లేని గదులలో పుట్టిన పిల్లలు

వెలుతురు ఎక్కువగా లేని విశాలంగా ఉండే చీకటి కొఠడీ గదులలో పుట్టిన పిల్లల జీవితం [illegible] ప్రారంభిస్తుందని ఒక గ్రీకు మనస్తత్వ శాస్త్రజ్ఞుడు జరిపిన సర్వే ప్రకారం తేలింది.

టీ సహజమైన పానీయం. దీంట్లో రసాయనిక పదార్థాలు గానీ, కృత్రిమ వాసన ద్రవ్యాలు గానీ, ఇతర రంగులుగానీ చేరి ఉండవు ఇది ఆరోగ్యదాయకమైన మరియు శక్తిదాయకమైన పానీయం అంటారు దీంట్లో విటమినులు ముఖ్యంగా B గ్రూపుకి చెందిన విటమినులు, రిబోఫ్లావిన్ (Riboflavin) మరియు నియాసిన్ (Niacin) ఉంటాయి దీంట్లో అతి తక్కువగా లభించే కెఫీన్ మానవ శరీరానికి ఆరోగ్యమైనది, అపాయకారి కాదు ప్రపంచం అంతా రోజుకి ఒక బిలియన్ కప్పుల టీ వినియోగమవుతూందని విశ్వసించబడుతూంది

— 'ఇండియన్ అండ్ ఫారిన్ రివ్యూ' సౌజన్యంతో

## 'విస్‌డమ్' పాత కాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, జనవరి '85, మార్చి '85 నుంచీ జూలై '85; ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, జూన్ '86, జూలై '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87 నుంచీ మే '87, జూలై '87, ఆగస్టు '87, నవంబరు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89; జనవరి '90 నుంచీ డిసెంబరు '90 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7.50లు, 1985 కాపీల వెల రూ. 8.00లు; 1986 కాపీల వెల రూ 13.50లు; 1987 కాపీల వెల రూ 14.50లు, 1988 కాపీల వెల రూ. 18.75లు, 1989 కాపీల వెల రూ 24.50లు; 1990 కాపీల వెల రూ. 28.00లు రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ 6.00లు చేర్చి M.O. పంపాలి 'రత్నా ఏజెన్సీస్', 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004*

— సర్క్యులేషన్ మేనేజర్

"ఇచ్చి పుచ్చుకొనుట ఇలలోని మర్యాద"
— గురజాడ

# సుప్రసిద్ధ యాత్రాస్థలాలు

## విరాలిమలై

ఎన్. రామకృష్ణ

విరాలిమలై తమిళనాడులో చిన్న పట్టణం శివుని కుమారునిగా వెలసిల్లిన శ్రీసుబ్రహ్మణ్యా స్వామి దేవాలయానికి ఇది ప్రసిద్ధి పొందింది. తమిళనాడులో సుబ్రహ్మణ్యస్వామినే మురుగన్ అంటారు తిరుచ్చి నుండి బస్సులు యాత్రికులను విరాలిమలైకి తీసుకు వెడతాయి ఈ దేవాలయం ఒక కొండ మీద ఉంది కొండకి 175 మెట్లుంటాయి.



కొండ ఎక్కేటప్పుడు మార్గమధ్యంలో చొక్కనాథర్ మండపం కనిపిస్తుంది. ఇది మెట్లకు కుడి ప్రక్కగా చిన్న గుహలో ఉంటుంది భక్తుడైన అరుణగిరి నాథర్‌కి కలలో మురుగన్ (సుబ్రహ్మణ్యస్వామి) కనిపించి విరాలిమలై ఆలయం దర్శించమని చెప్పాడట అరుణగిరి నాథర్ దట్టమైన అడవులగుండా ప్రయాణం చేస్తూండగా క్రూరమృగాలు ఆటంకం కలిగించాయి. వెంటనే మురుగన్ ఒక వేటగాని వేషంలో ప్రత్యక్షమై అతడిని రక్షించాడు. మురుగన్ ఆ అడవి మృగాలను ఎదుర్కొన్న అటవీ ప్రదేశాన్ని వేడన్ కాత్తూర్ అంటారు

అరుణగిరినాథర్‌కి చొక్కనాథర్ మంటపంలో 'అష్టమసిద్ధి' లభించింది. అరుణగిరి నాథర్‌ని మురుగన్ ఆశీర్వదిస్తూ ఒక సందేశాన్ని ఇచ్చాడు. ఈ భక్తుడు మొట్టమొదట వయలూర్‌లోను తరువాత విరాలిమలై లోనూ మురుగన్ మీద అనేక పాటలు వ్రాసాడు చొక్కనాథర్ మంటపంలో చొక్కనాథర్ (శివ), మీనాక్షి (శివుని భార్య) మరియు గణేశుడు (శివుని కుమారుడు) విగ్రహాలు ఉన్నాయి.

## గృహాంతర్గత వాతావరణం అంతా కాలుష్యమే

*ఇంట్లో నిత్యోపయోగవస్తువులు, గృహనిర్మాణక వస్తువులు, సిగరెట్టు పొగ మొదలైన వాటివల్ల గృహాంతర్గత వాతావరణం రసాయనిక ఫ్యాక్టరీల బాహ్యవాతావరణంలో కాలుష్యానికి 10 రెట్లు అధికం అని అమెరికన్ ఎన్విరాన్‌మెంటల్ ఏజెన్సీ వారు గ్రహించారు సాధారణంగా ఇళ్ళలోపల మోత్ బాల్స్‌లోను, డియోడొరెంట్లలోను వాడే పారాడైక్లో, బెంజీన్, ప్లాస్టిక్స్‌లో ఉపయోగించే స్టైరీన్, ఫోమ్ రబ్బరు, ఇన్సులేషన్, సిగరెట్ల పొగలో ఉండే బెంజీన్, కొళాయి నీళ్ళ వల్ల వచ్చే క్లోరిన్, గాసోలిన్ వల్ల కాలుష్యం అధికంగా ఏర్పడుతూంది.*

*-'సి ఇ.ఇ-ఎన్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో*

"అబద్ధాలకు కాళ్ళులేవు కాని అపవాదాలు రెక్కలుకట్టుకుని ఎగురుతాయి."

చొక్కనాథర్ మండపం వెనుక నుంచి ఒక అరణ్య మార్గం గుండా కొండకు మరో ప్రక్కగా ఉండే విరాళినాథర్ గుహదగ్గరకు వెళ్ళాలి. ఈ కొండ గుహలో ఒక చిన్న బ్రహ్మ విగ్రహం ఉంది. గుహలో సొరంగమార్గం ద్వారా కొండ మీద గర్భగుడిలోకి ప్రవేశిస్తాం ఇది ఇప్పుడు ఉపయోగంలో లేదు. దీనికి దగ్గరగా అందమైన నెమళ్ళు పురివిప్పుకుని నాట్యమాడుతూ ఉంటాయి.



గర్భగృహంలో మురుగన్ ఆరు ముఖాలతో

ఈ దేవాలయంలో గల కంచునారద విగ్రహం వంటిది దక్షిణాదిని ఇతర దేవాలయాలలో ఎక్కడా లేదు.

పుదుక్కోట్టై రాజా తీవ్రమైన ఉదరవ్యాధితో బాధపడుతూండగా మురుగన్ కలలో కనిపించి రాత్రిపూట పూజాసమయంలో ఒక చుట్టను (Cigar) ఇమ్మని ఆదేశించాడట. ఇక్కడ నేటికీ రాత్రిపూట చుట్ట ఇవ్వడం ఆచారంగా ఉంది

అందమైన విరాలిమలైని అన్ని దిక్కుల నుంచీ చూడవచ్చు ముఖ్యమైన మురుగన్ ఉత్సవాలకు తమిళనాడు నుండి భక్తులు అనేక మంది వస్తారు ●

# విషవాయువులను వదిలే దేశాలు

ప్రపంచ వాతావరణమే మారిపోతుందేమో అను కునేటట్లుగా యునైటెడ్ స్టేట్స్ తరువాత సోవియెట్ యూనియెన్, బ్రెజీల్, చైనా మరియు ఇండియా అత్యధికంగా వివిధ వాయువులను (విషం) వదులు తున్నాయి. ఈ వాయువులు వాతావరణంలో చేరి భూమి మీద వేడిని ఆకాశంలోకి పోనీయ కుండా ఆటంకపరచి గ్రీన్‌హౌస్ (greenhouse) ప్రభావం కలుగజేస్తాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. ఇవి కర్ర, ఇతర శిలాజ సంబంధ మైన ఇంధనాలు కాల్చినప్పుడు బయలుదేరే కార్బన్ డయాక్సైడ్, సేంద్రీయ పదార్థాలు కుళ్ళినప్పుడు ఉద్భవించే మిథేన్, రెఫ్రిజిరేటర్లు, కూలర్లు మరియు ఎయిర్ కండిషనర్లు వదిలే క్లోరోఫ్లోరో కార్బన్లు ఈ గ్రీన్‌హౌస్ వాయువుల వల్ల వాతా వరణంలో వింత మార్పులు కలుగవచ్చు. తీర ప్రదేశాలలో సముద్రపు నీటి మట్టాలు పెరిగి నీరు భూప్రదేశం మీదికి, ద్వీపాలలోకి ప్రవేశించడం వల్ల మిలియన్ల కొద్దీ జనం వాటిని వదిలి వెళ్ళ వలసి వస్తుంది

— 'సి ఇ ఇ-ఎన్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో

# జీవితంలో హాస్యం

Family Planning Guidance Bureau




కుటుంబ నియంత్రణ మార్గదర్శక కార్యాలయం

"బ్రతికి చచ్చియు ప్రజలకెవ్వడు
ప్రీతి కూర్చునో వాడే ధన్యుడు."

# ...కు చిట్కాలు

మీ చిన్నారి పాపల కాలం సద్వినియోగ పడేటట్టుగా షెడ్యూలు ప్రకారం కార్యక్రమాను వర్తనకు సహకరించండి. పిల్లలకి బుద్ధి క్రమ విధానంలో ఉండదు.

పిల్లల ముందు ఉపాధ్యాయులను గురించి, ఇతర పెద్దల గురించి కించపరచేటట్లు మాట్లాడవద్దు. పిల్లలు పెరిగి పెద్దవారై స్కూలుకు వెళ్ళేటప్పుడు, చర్చికి వెళ్ళేటప్పుడు మీ అలవాట్లే వాళ్ళకీ అబ్బుతాయి.

ఎన్నడూ పిల్లలను ఎగతాళి చేయవద్దు

మీ పిల్లలను జాగ్రత్తగా పెంచి పెద్దచేయండి వారి జీవితాలు నాశనం చేయవద్దు

మీ పిల్లలు అందరితోనూ మర్యాదతో స్నేహంగా ఉండేటట్లు నేర్పండి.

మీ పిల్లలతో చేరి కాలం గడపండి వస్తువాహనాల కంటే పిల్లలపై మీరు చూపే మీ అభిమానం చాలా ముఖ్యం. సాయంకాలం కాసేపు టివి కట్టిపెట్టి కుటుంబం మంచి చెడ్డలు ఆలోచించి మరింత సన్నిహిత సంబంధం ఏర్పరచుకోండి



మీ పిల్లలను క్రమశిక్షణలో పెట్టండి మొట్ట మొదట క్రమశిక్షణతో కూడిన మీ జీవితంతోటే మీ పిల్లల క్రమశిక్షణ ప్రారంభమవుతుంది.

వాస్తవిక ధనభావంతో సంతోషంగా, హాయిగా ఉండే జీవన విధానాన్ని జీవించండి. మీ పిల్లలు మిమ్మల్ని చూచి మీలాగే తయారవుతారనే విషయాన్ని గ్రహించండి. మీ జీవితాన్ని బట్టే పిల్లలు వారి జీవితాన్ని తీర్చి దిద్దుకుంటారు. పిల్లలకు మీరిచ్చిన మాట నిలబెట్టుకోండి.

మంచి నడవడి, క్రియాభిలాష, మంచి అలవాట్లు, సరైన భాష మాట్లాడటం, డబ్బు సద్వినియోగం చేయడం, ఆరోగ్యవిధులు, సురక్షతకు సంబంధించిన అలవాట్లు నేర్పండి. నాగరిక ప్రపంచంలో జీవించడానికి అవసర మైన విధులన్నీ అలవాటు చేయండి.

## పెట్రోలు బాష్పీభవనం తగ్గించాలంటే

*సామాన్యంగా స్కూటర్, మోటార్‌సైకిల్ వంటి రెండు చక్రాల వాహనాలను ఎండలో 35 మొదలు 37 డిగ్రీల సెల్షియస్ దగ్గర 8 గంటలసేపు పార్క్‌చేసి ఉంచినప్పుడు పెట్రోల్ టాంక్ నుంచి సుమారు 23 మిల్లీలీటర్లు (2 3 శాతం) పెట్రోలు ఆవిరి అయిపోతుంది కనిపించకుండా జరిగే ఈ పెట్రోలు వ్యర్థాన్ని తగ్గించాలంటే?*

* *నీ వాహనాన్ని నీడలో పెట్టి ఉంచు*
* *వీలైనప్పుడు పెట్రోల్ టాంకులను తడిగుడ్డతో కప్పి ఉంచు*
* *కొన్ని రోజులపాటు నీ బండిని నీవు ఉపయోగించ నప్పుడు టాంక్‌లో తక్కువగా పెట్రోలు ఉంచు*

—ప్రభు మాత్, బెంగళూరు
*'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"తన్ను తానరసి ఉన్నట్లు ఉంటే ఎన్ని తలపులు రానీ, పోనీ తన్నేమీ చేయలేవు."

# మీకు

## న్యూస్‌ప్రింట్ ఉత్పత్తికి అగ్రగణ్యులు

న్యూస్‌ప్రింట్ ఉత్పాదనలో యునైటెడ్ స్టేట్స్ కెనడా, బ్రిటన్, స్వీడెన్, జర్మనీలు అగ్రస్థానం వహిస్తున్నాయి. ప్రపంచపు న్యూస్‌ప్రింట్ సరఫరాలో కెనడాది 50 శాతం అని పరిగణించ బడింది

## తేనెటీగలకు మానవునిలాగా కండరాలు ఉన్నాయి




తేనెటీగకు మానవునిలాగా కండరాలు ఉన్నాయి ఇది కుట్టడానికి 22 కండరాలను ఉపయోగిస్తుంది.

## ప్రపంచంలో అధిక విషకరమైన సాలె పురుగు

ఆస్ట్రేలియా టన్నెల్-వెబ్ సాలెపురుగు ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ విషకరమైనది. ఒక్కసారి కుడితే మరణం తప్పదు. ఆ విషానికి ఇంత వరకూ తెలిసిన విరుగుడు లేదు.

## అతివేగంగా డ్రైవ్‌చేసే పెరిగ్రీన్ ఫాల్కన్

ప్రపంచంలో అతి వేగవంతమైన ప్రాణులలో ఒకటైన పెరిగ్రీన్ ఫాల్కన్ డేగ గంటకి 120 కి మీ కు పైబడిన వేగంతో నీటిలో మునిగి డైవ్ చేస్తుంది

## మిక్కిలి పెద్దకుర్చీ

మిక్కిలి పెద్ద కుర్చీ స్వీడెన్‌లో 1944లో తయారుచేయబడింది ఇది 9 మీటర్ల ఎత్తుగా, 4 2 మీటర్ల వెడల్పు కలిగి ఉంటుంది

## 31 మంది స్వారీచేసే బైసైకిల్!

ఆస్ట్రేలియాలో క్వీన్‌బెయాన్‌లో 31 మంది స్వారీ చేయగల బైసైకిల్ తయారు చేయబడింది!

## విలంబిత పుష్పి

దక్షిణ అమెరికా బొలీవియాలో 'పుయు రెయ్‌మాండీ' (Puyu raimondii) అనే మొక్క పూతపూయడానికి 150 సంవత్సరాలు పడుతుంది

## 'మసాలా' టీ

*మీలో చాలామంది టీకి అలవాటు పడ్డవారే అందరూ ప్రతీరోజూ ఏదో కంపెనీవారి టీ త్రాగుతారు అయితే మసాలా టీ ఎప్పుడైనా చేసుకు త్రాగారా? శొంఠి, మిరియాలు, లవంగాలు, ఏలక్కాయలు, దాసిన చెక్క (లవంగపట్ట) సమభాగాలుగా తీసుకుని మెత్తగా మిక్సీలో పొడిచేసుకుని ఒక సీసాలో జాగ్రత్త చేయండి టీ డికాక్షను తయారు చేసేటప్పుడు ఒక చిటికెడు పైపొడిని అందులో కలిపి మామూలుగా టీ తయారుచేసి త్రాగి చూడండి ఎంతో రుచిగానూ, ఉత్తేజకరంగానూ ఉంటుంది. ఇదే మసాలా టీ*

"బలహీనులకు, బద్ధకస్తులకి ఏ మాత్రం అందరానిది ఆత్మ సాక్షాత్కారం." — ముండకోపనిషత్తు

## 110 ఎడిలో నిర్మించిన ఆనకట్ట ద్వారా సెగోవియాకి నీటిసరఫరా

స్పెయిన్‌లో సెగోవియా అనే పట్టణానికి 110 A.D లో కట్టిన ఆనకట్ట ద్వారా ఇప్పటికీ నీరు సరఫరా అవుతూంది

## ఆంగ్లభాషలో రుబాయత్ మిక్కిలి ప్రసిద్ధి పొందిన పద్యం

ఆంగ్లభాషలో ఒమర్‌ఖయ్యామ్ రచించిన రుబాయత్ మిక్కిలి ప్రసిద్ధి పొందిన పద్యాలలో ఒకటి ఇది 1859 లో మొట్టమొదట ప్రచురించ బడింది

## ఆనియన్ అనే పదానికి మూలం

ఇంగ్లీషులో ఉల్లిపాయకి ఆనియన్ (onion) అనే పదం 'పెద్ద ముత్యం' (large pearl) అనే లాటిన్ (unio) మాట నుంచి ఉత్పత్తి కాబడింది

## మిక్కిలి పెద్ద టాయ్‌షాప్

ఇంగ్లండ్ లండన్‌లో రీజెంట్ స్ట్రీట్‌లో గల హామ్‌లేస్ ఆటవస్తువుల షాపు ప్రపంచంలో మిక్కిలి పెద్ద టాయ్‌షాప్. ఇది 1760 లో ప్రారంభింపబడింది.

## కవరు

ప్రపంచంలో ప్రజలు 2000 సంవత్సరాలుగా ఉత్తరాలు వ్రాసుకుంటున్నా మొట్టమొదట 1839 లోనే ఎన్‌వలప్ (కవరు) ఉపయోగింప బడింది.

## 'PALACE'

రోమ్ (ఇటలీ)లో ధనవంతులు, రోమన్ చక్రవర్తులు పాలాటైన్ హిల్ మీద భవనాలు కట్టుకున్నారు. ఆ కొండల పేరు నుంచి ఇంగ్లీషులో 'Palace' అనే పదం ఏర్పడింది.

## ప్రపంచంలో అధిక ప్రఖ్యాతి పొందిన స్కూలు

ప్రపంచంలో ఎటాన్ కాలేజి (Eton college) మిక్కిలి ప్రఖ్యాతి పొందిన స్కూలు దీనిని ఇంగ్లండు దేశపురాజు అయిన 6వ హెన్రీ (1422-1461) 1440 లో స్థాపించాడు.

## సర్వవ్యాపకమైన పరమ సత్యం


SWAMI RAMADAS

'ధర్మపరిపాలనకై స్థిరంగా నుంచో
అటుంది కొండ.
'నీ హృదయం సాగర వీచికల లాగా ఉప్పొంగనీ
ప్రేమానురాగాలతో లేచి పడుతూండనీ'
అని ఘోషిస్తుంది సముద్రం
ప్రతీ చెట్టు, ప్రతీ మొక్క, ప్రతీ గడ్డిపరక
'మేము ఇచ్చేటట్టు ఇస్తూండు' అంటాయి
'ప్రపంచ జీవితాన్ని ఆనందమయం చేయమని'
సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఉద్బోధిస్తారు.
ఆకాశం, అంతరాళం 'సంతోషాన్ని కాంతిని
అంతటా వెదజల్లు' అని ప్రతిధ్వనిస్తుంది
సర్వవ్యాపకమైన సమానత్వం ఒక్కటే.
తెలుసుకో - ఒకే దైవం
సర్వవ్యాపకమై ఉన్నాడు.

—స్వామీ రామదాసు

"లోకం వాస్తవం అయినా కాకపోయినా ఎవరికి వారు వాస్తవం."

## మిక్కిలి ఎత్తయిన సైనికుడు

యూరప్‌లో ఫిన్‌లాండుకు చెందిన వెయ్‌నో మిల్లీరిన్నె మిక్కిలి ఎత్తయిన సైనికుడు 1909లో పుట్టిన ఇతడు 2 47 మీటర్ల ఎత్తు ఉన్నాడు

## కంగారు రికార్డు వేగం



KANGAROO

సుమారు 3.2 మీటర్లు ఎత్తుగా ఉండి 13 5 మీటర్ల దూరం గెంతగల కంగారు గంటకు 41 కి.మీల రికార్డు వేగం అందుకోగలదు

## ప్రపంచంలో అతిప్రాచీన సమాధి

పశ్చిమ ఆసియా సిరియాలోని డెమాస్కస్‌లో ఆబెల్ (Abel) సమాధి ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైనదని విశ్వసింపబడుతూంది. ప్రతీ సంవత్సరం వేలకొలదీ భక్తులు దీనిని సందర్శిస్తారు.

## మిలియన్ జనాభా దాటిన ప్రపంచపు మొదటి నగరం

ప్రపంచ నగరాలలో మిలియన్ జనాభా దాటిన మొట్టమొదటి నగరం లండన్.

## గాస్ అనే పదం

జె.బి వాన్ హెల్‌మోంట్ అనే డచ్ శాస్త్రజ్ఞుడు గాస్ అనే పదాన్ని సృష్టించాడు దీనికి కియాస్ (chaos) అనే గ్రీక్ పదం ఆధారం. ఇది మొట్టమొదట 1624 లో వాడబడింది.

## భారతదేశపు స్త్రీలలో ప్రప్రథములు



Sarojini Naidu

మొట్టమొదటి మహిళా కేంద్రమంత్రి - శ్రీమతి రాజ్‌కుమారి అమృత్ కౌర్

మొట్టమొదటి మహిళా ముఖ్యమంత్రి - శ్రీమతి సుచేతా కృపలాని

మొట్టమొదటి మహిళా గవర్నర్ - శ్రీమతి సరోజిని నాయుడు.

మొట్టమొదటి మహిళా మంత్రి - శ్రీమతి విజయ లక్ష్మి పండిట్

మొట్టమొదటి మహిళా ప్రధాన మంత్రి - శ్రీమతి ఇందిరా గాంధీ

మొట్టమొదటి అసెంబ్లీ మహిళా సభాపతి - శ్రీమతి షన్నోదేవి

మొట్టమొదటి మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు - శ్రీమతి సరోజిని నాయుడు

మొట్టమొదట ఎవరెస్ట్ శిఖరం అధిరోహించిన మహిళ - శ్రీమతి బచేంద్రిపాల్

## గ్రంథాలు-గ్రంథరచయితలు

రిపబ్లిక్ ... ప్లేటో

సెవెన్ సమ్మర్స్ ... ముల్క్‌రాజ్ ఆనంద్

రైట్స్ ఆఫ్ మాన్ .. థామస్ పెయిన్

ప్రిజనర్ ఆఫ్ జెండా ... ఆంథోనీ హోప్

ది ఇండియన్స్ ... కుష్వంత్ సింగ్

"ఇంటిపై మరులుగొని కొండలలో తమ గూళ్ళకు మరలివెళ్ళే కొంగల గుంపులా నా జీవితమంతా తన శాశ్వత గృహానికి యాత్ర చేసి ఒక్క నమస్కారంతో నీ పాదాలు స్పృశించనీ." —ఠాగూర్

# చీర్ పెజెంట్ కుటుంబ జీవనం

చీర్ పెజెంట్ ఒక వింతపక్షి. ఇవి రెండు లేక ఆరు పక్షులుచేరి ఏటవాలుగా ఉండే ఎత్తయిన హిమాలయా ప్రదేశాలలో చిన్న కుటుంబంగా జీవిస్తాయి. నేలను పల్లంగా చేసి చిన్న చిన్న కొమ్మలు, గడ్డితో కప్పి ముఖ్యంగా కొండల మీద, కొండల క్రింద గూళ్ళు కట్టుకుంటాయి. గూళ్ళలో గ్రుడ్లు ఉన్నప్పుడు గానీ, చిన్న చిన్న పక్షులు ఉన్నప్పుడుగానీ పుంజు దీనిని జాగ్రత్తగా కాపాడుతూంటుంది. కుటుంబంలో పెద్ద అనిపించుకునే తండ్రి పక్షి ఇతర తిరుగుబోతు పక్షులు రాకుండా కుటుంబాన్ని సంరక్షించుకుంటాయి.



CHEER PHEASANT

శీతకాలంలో ఈ పక్షి కుటుంబాలు చెట్ల మీదే నివసిస్తాయి గూటిలో గ్రుడ్లు ఉన్నంత కాలం పెట్ట రాత్రిపూట గూటిలో ఉంటే, ప్రక్క చెట్ల కొమ్మల మీద పుంజు కావలాకాస్తుంది.

చీర్‌పెజెంట్ పక్షులు వలస ఏర్పరచుకోడానికి ప్రదేశాన్ని జాగురూకతతో ఎన్నుకుంటాయి. ఇవి సాధారణంగా చిర్ పైన్ (Chir pine) అడవులలో బహిరంగంగా తిరుగుతూ ఉంటాయి. చిర్ పైన్ అడవులలో నివాసాన్ని బట్టే దానికా పేరు స్థిరపడింది విస్తారంగా నీరు లభించే తీరప్రదేశాలలో ఇవి జతకడుతుంటాయి అంటే నిర్మించుకున్న గూడు దూరంగా ఉన్నా వీటి 'ప్రాదేశిక హక్కు' (Territorial claim) నీటి ప్రవాహం మీద కూడా ఉంటుంది.

చీర్ పెజెంట్ సాధారణంగా శాఖాహార పదార్థాలను తింటాయి. చిన్నవి మామూలు కీటకాలను కూడా తింటాయి. పెద్దవి మాత్రం పూర్తిగా శాఖాహారులే. చీర్ పెజెంట్లు సాధారణంగా నిర్మానుష్యమైన కొండల ఏటవాలు ప్రదేశాలలో నివసిస్తాయి చీర్ పెజెంట్‌లు ముఖ్యంగా వాటి గూళ్ళు దగ్గర ఎటువంటి అలజడి లేకుండా నిశ్చింతగా జీవించడానికి ఇష్టపడతాయి. అవి ఉండే చెట్లు వాసస్థలాలు ఇతర వాటికి ఎక్కువగా తెలిస్తే అవి అక్కడ నుంచి వేరే ప్రదేశానికి వెళ్ళిపోతాయి

పశ్చిమ హిమాలయా పర్వతప్రదేశాలలో నేపాల్ నుంచి పాకిస్థాన్ వరకు ఇవి నివసిస్తూండడం వల్ల ఈ చీర్ పెజెంట్ భారత దేశపు పక్షి అని చెప్పుకోవాలి.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ఐదు లక్షల జాతుల ప్రాణులు సముద్రాలలో నివసిస్తున్నాయి

*మొత్తం భూభాగంలో 20 శాతం చెట్లు, జంతువులు మాత్రమే భూమి మీద జీవిస్తున్నాయి. 71 శాతం భూతలాన్ని ఆక్రమించే సముద్రాలు వివిధ రకాల చెట్లకు, ప్రాణులకు ఆశ్రయం ఇస్తున్నాయి సుమారు 500,000 రకాలు భూ పరిసర పరిస్థితులకు విరుద్ధంగా సముద్రాలలో వివిధ వాతావరణ పరిసరాలలో నివసిస్తున్నాయి.*

"పురుష ప్రయత్నం, వివేకం, తపస్సు - దీనివలన కలుగు గుణములే మహోన్నతస్థితికి కారణములు."

# ఈ శతాబ్దంలో

## వాతావరణంలో అకస్మాత్తుగా జరిగిన మార్పు

యుఎస్ఎ దక్షిణ డకోటాలో స్పియర్‌ఫిర్త్ దగ్గర 1943 జనవరి 22 న ఉన్నట్టుండి అకస్మాత్తుగా ఉష్ణోగ్రతలో మార్పు ఏర్పడింది. ఇక్కడ ఉష్ణోగ్రత ప్రొద్దున్న 7.30 నుంచి 7 32 మధ్య రెండే రెండునిమిషాలలో - 4 డిగ్రీల F నుంచి 45 డిగ్రీల Fకి పెరిగిపోయింది.

## ప్రపంచంలో బ్రహ్మాండంగా అమ్ముడైన కాల్పనిక నవల



అమెరికన్ అంతర్యుద్ధ (Civil War) సమయంలో మార్గరెట్ మిచ్చెల్ జార్జియా, గురించి వ్రాసిన 'గాన్ విత్ ది విండ్' ప్రపంచంలో మిక్కిలి బ్రహ్మాండంగా అమ్ముడైన కాల్పనిక నవల. ఈమె దీనిని 1936 జూన్ 30న ప్రచురించింది ఈమె నవలలలో ఇదొక్కటే మిక్కిలి ప్రాచుర్యం పొందింది.

## దక్షిణధృవం చేరిన అన్వేషకుడు

ఇంగ్లీష్ నౌకాధికారి మరియు అన్వేషకుడు అయిన కాప్టెన్ రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ 1912 జనవరి 18న దక్షిణధృవాన్ని చేరాడు ఇతడు మొట్టమొదట 1911లో దక్షిణధృవాన్ని చేరిన నార్వేజియన్ అన్వేషకుడు రోల్డ్ అముండ్‌సెన్ చేరిన 35 రోజుల తరువాత చేరాడు తిరుగు ప్రయాణంలో అతడు, అతడితో పాటు మరి నలుగురు స్నేహితులు మరణించారు

## టెలివిజన్ ట్రాన్స్‌మిషన్ ప్రప్రథమ ప్రదర్శన

స్కాట్‌దేశపు కల్పనాచతురుడు మరియు టెలివిజన్‌కి మార్గదర్శకుడు అగు జాన్ లోగీ బయర్డ్ 1926 జనవరి 29న మెకానికల్ స్కానింగ్ డిస్క్ సహాయంతో మొట్టమొదట టెలివిజన్ ట్రాన్స్‌మిషన్‌ను ప్రదర్శించాడు ఇతడు 1939లో కలర్ టివిని ప్రదర్శించాడు

## మొట్టమొదట ఉత్తరధృవం చేరిన 'ఆర్టికా'



సోవియెట్ యూనియన్‌కి చెందిన న్యూక్లియర్ శక్తితో మంచును పగులగొట్టే ఆర్టికా (Artika) భూమి కక్ష్య ఉత్తరపుకొన ఉత్తరధృవాన్ని 1977 ఆగస్టు 17న మొట్టమొదట చేరింది.

## కుల్లినెన్ వజ్రం

దక్షిణ ఆఫ్రికాలో ప్రీమియర్ గనిలో బ్రహ్మాండమైన మిక్కిలి పెద్ద వజ్రం కుల్లినెన్ (Cullinen) 1905 జనవరి 26న కనుగొనబడింది.

"మానవజాతికి ఆత్మశుద్ధి లేకపోతే ఏ జాతిలో జనించినా ముక్తి పొందలేదు"

# మాయమైన ఓడల రహస్యం

'ఉరాంగ్ మెడాన్' (Urang Medan) అనే ఓడ 1948 ఫిబ్రవరిలో మలాకా జలసంధులలో (ఆగ్నేయ ఆసియా) గొప్ప విపత్తులో చిక్కుకుంది ఓడమీద నౌకా సిబ్బందిలో అందరూ పూర్తిగా మరణించినట్లు ఓడఎక్కి చూచిన రక్షక సిబ్బంది వల్ల తెలిసింది ఓడ కాప్టెన్ మృతదేహం ఓడలో బ్రిడ్జి మీద ఉంది ఆఫీసర్ల మృతదేహాలన్నీ చార్ట్‌రూమ్ మరియు వీల్‌హౌస్‌లో ఉన్నాయి. మరణించిన వారి ముఖాలు భయంతో వికృతరూపంతో ఉన్నాయి. అయినా మరణించిన వారి శరీరాల మీద ఎటువంటి గాయాలు లేవు మరి ఏంజరిగింది?

కొన్ని రోజుల తరువాత నార్త్ అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ప్రయాణం చేస్తూన్న అయిదు ఏవెంజర్ ప్లేనులు కనిపించలేదని తెలిసింది విమానాలు బయలుదేరిన 90 నిమిషాలకు ఒక విమానం నుంచి వచ్చిన రేడియోగ్రాం వల్ల అన్ని విమానాలు ఆపదలో ఉన్నట్టు తెలిసింది. అవి మార్గం తప్పిపోయాయి. భూమి మీద నుంచి చూస్తే ఎక్కడా కనిపించడం లేదు. విమానాశ్రయంలో ఈ విమానాలు ఎందుకు తప్పిపోయాయి, వైమానిక సిబ్బంది ఎందుకు భయపడ్డారు అనే విషయాలు ఎవ్వరికీ తెలియడం లేదు వెంటనే వార్తాసంపర్కం ఆగిపోయింది ఆ విమానాలు ఎక్కడా ఎన్ని రోజులకీ కనిపించ లేదు ఈ ఘోరవిపత్తుకి కారణం ఏమిటో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు.

1930 దశాబ్దంలో శాస్త్రజ్ఞులు ఒక అద్భుతమైన విషయాన్ని కనిపెట్టారు. తుఫాను చెలరేగిన సముద్రంలో ఇన్‌ఫ్రాసోనిక్ ఆసిలేషన్స్ (అధోబ్ద కంపనలు) బయలుదేరుతున్నాయని తెలుసుకున్నారు వాటికి 'సముద్రవాణి' (Voice of the sea) అని పేరుపెట్టారు

జీవశాస్త్ర నిపుణులు మరో అద్భుతమైన రహస్యం చెప్పారు. ఈ తీవ్రమైన ఇన్‌ఫ్రాసౌండ్

## నిడివైన రెక్కల పక్షి



ALBATROSS

*ఆల్‌బట్రాస్ అనే పక్షి సాధారణంగా దక్షిణార్ధ గోళంలో నివసిస్తుంది. వీటిరెక్కల నిడివి ఏ ఇతర పక్షులకూ లేనంత ఎక్కువగా3 7 మీటర్లు ఉంటుంది*

*చిన్న ఆల్‌బట్రాస్ జన్మించిన ద్వీపాన్ని వదిలి వెళ్ళాక జతకూడే సమయంలో తప్ప తిరిగి ఇది భూమి మీద కనిపించదు. కొన్ని రెండు సంవత్సరాల దాకా ఏ భూప్రదేశం మీదవాలదు -ఇవి కొన్ని నెలల పాటు సముద్రపు నీరు త్రాగుతూ, సముద్ర తలం మీదే నివసిస్తాయి!*

*క్రమక్రమంగా చివరలు కోసుగా ఉండే రెక్కల వల్ల ఇవి ఏ ఇతర పక్షులకంటే సౌలభ్యంగా ఎగుర గలవు. ఇది సాధారణంగా సముద్రంలో చేపలను, సముద్రంలో పారవేసిన వ్యర్థ ఆహార పదార్థాలన్ను, చచ్చి నీటిపై తేలుతున్న జంతువులను తింటుంది. ఇది సామాన్యంగా తెల్లగా ఉంటుంది. కోసుగా ఉండే రెక్కల చివరలు నల్లగా ఉంటాయి*

"ఆదరిస్తే ఆనందిస్తూ, అనాదరానికి
ఆగ్రహం చెందడం విద్వాంసుల లక్షణం కాదు."

..నవల వల్ల ప్రాణులలో అకారణంగా ఒక విధమైన ఆదుర్దా, బెంగ, భయం జనిస్తాయి అని అన్నారు.

ప్రతీ సజీవప్రాణిలోను ల్ఫ్రీక్వెన్సీ ఆసిలేటరీ మూవ్‌మెంట్స్ (అధో పౌనఃపున్య కంపన చలనాలు) ఉంటాయి ఇన్‌ఫ్రాసోనిక్ అవధి (Period) ఈ కంపనల అవధితో ఏకమైనప్పుడు లేక కంపనల అవధికి చేరువగా ఉన్నప్పుడు ప్రతిధ్వని ప్రేరేపించబడుతుంది. గుండెలో కంపన పరిమితి విస్తరించుకుని ధమనులు పగిలిపోతాయి లేక తెగిపోతాయి ఇన్‌ఫ్రా సౌండ్ చాలా తీవ్రంగా ఉన్నప్పుడు రక్తప్రసారం లేక గుండె కూడా ఆగిపోతుంది మధ్యరకం తీవ్రతగల ఇన్‌ఫ్రాసౌండ్ వల్ల దృష్టిపోయి అకస్మాత్తుగా అంధత్వం కూడా ఏర్పడవచ్చు

ఇన్‌ఫ్రాసౌండ్ తాకిడి సముద్రంపైన చాలా దూరం వరకూ వ్యాపిస్తుంది సముద్రతీర ప్రదేశాలలో ఈ తాకిడి వల్ల రోడ్డు ప్రమాదాలు కూడా చాలా ఎక్కువగా జరుగుతాయి తుఫాను సైముల్లో రోగుల వ్యాధులు తీవ్రరూపం దాలుస్తాయి ముఖ్యంగా గుండె జబ్బుల గల వాళ్లమీద ఇన్‌ఫ్రాసౌండ్ ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

ఈ వైజ్ఞానిక విషయాలన్నీ సముద్రంలో ఓడల నాటకాన్ని వెల్లడి చేస్తాయి నిజమే కావచ్చు! ఈ ప్రమాదం నిశ్చలమైన సముద్రం మీద జరిగింది. కానీ ప్రమాదం జరిగిన ప్రదేశం నుంచి కొన్ని వందల మైళ్ల దూరంలో చెలరేగిన తుఫాను వల్ల ఇన్‌ఫ్రాసోనిక్ తరంగాలు సంభవించి ఉండవచ్చు.

ఈ 'సైలెంట్ కిల్లర్' (రహస్య హంతకుడు)ను గురించి నిస్సందేహంగా శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తారు దీనివల్ల ఎటువంటి రహస్యమైన అపాయాలు జరగకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవచ్చు. మెరైన్ స్టాటిస్టిక్స్ పరిశీలిస్తే ఈ సమస్య మరింత తీవ్రంగా ఉన్నట్టు కనిపిస్తుంది. ప్రతీ సంవత్సరం పెద్ద పెద్ద ఓడలు అపాయ సూచనలు పంపే ముందుగానే మాయమై పోతున్నాయి! దానికి కారణం ఇన్‌ఫ్రాసౌండ్ కావచ్చు.

●

# వనితా లోకం

## ఇంటి సలహాలు



* దుంపల వంటి కూరగాయలను మూత పెట్టిన బాణలిలోనూ, ఆకుకూరలను మూతపెట్టని బాణలి లోను వండాలి.

* అన్నం ఉడుకుతూన్నప్పుడు వచ్చి నిమ్మ కాయ రసం నాలుగు చుక్కలు అందులో పిండితే అన్నం బాగా తెల్లగా ఉంటుంది. మెతుకులు ఒకదానికి ఒకటి అంటుకోవు.

* టీ డికాక్షను ఉపయోగించిన తరవాత మిగిలి పోయిన టీ నీళ్ళతో అద్దాలు, అద్దాల కిటికీ తలుపులు తుడిస్తే నిర్మలంగా ఉంటాయి.

* నాలుగైదు అమోనియా చుక్కలతో హైడ్రోజన్ పెరాక్సైడ్ కలిపి దానితో తుడిస్తే బట్టల మీది అత్తరు మరకలు పోతాయి

* పాలు కాచే పాత్రకు పైన, లోతట్టు కొద్దిగా గ్లిసరిన్ పట్టిస్తే పాలు పైకి పొంగవు.

—'ది ట్రిబ్యూన్' సౌజన్యంతో

"సాత్విక స్వభావం, ఉద్యోగయత్నం, క్లేశసహనం,
ధర్మబద్ధతగల పురుషుడు ఎన్నడూ వంచితుడు కాడు."

# నేనే - నీ లివర్, గాల్ బ్లేడర్

డా.కె.పి.మిశ్రా, విజయ్ జయగోపాల్
ఎస్.అంబళవానన్

మేము ఇద్దరం. నీ శరీరంలో ప్రత్యేకంగా విడివిడిగా రెండు అంగ విభాగాలు లివర్ మరియు గాల్ బ్లేడర్‌గా ఉన్నాం మా ఇద్దరిని చేర్చి హెపాటో-బైలియరీ సిస్టమ్ (hepato-biliary system) అంటారు హెపాటో అంటే లివరు, బైలియరీ అంటే పిత్తరసం (బైలు)కు సంబంధించిన అని అర్థం. మేము నీ శరీరంలో వంటగది అనుకో మేం ముఖ్యంగా జీర్ణ ప్రక్రియకు సహకరిస్తాం




నీ లివర్ - నేను గోధుమ రంగులో అతి మృదువుగా ఒక చీలగా నీ పొత్తికడుపులో పైవైపు కుడి ప్రక్క రొమ్మునకు, ఉదరమునకు మధ్య గల స్నాయువు (diaphragm) క్రింద ఉంటాను. నా భారం సుమారు 1400-1800 గ్రాములు. నాకు రెండు చెవుల వంటి భాగాలు (లోబ్స్) ఒకటి ఎడమప్రక్క, ఇంకొకటి కుడి ప్రక్క ఉంటాయి నా కుడి ప్రక్కన ఉండే లోబ్ (lobe) పెద్దదిగా పొత్తికడుపులో కుడిప్రక్కగా ఉంటుంది నా ఎడమప్రక్క లోబ్ చిన్నదిగా మధ్య భాగంలో ఉంటుంది నేను నీ జీర్ణకోశానికి కామన్ హెపాటిక్ డక్ట్ అనే వాహిక ఆధారంతో అంటిపెట్టుకుని ఉంటాను నీ గాల్ బ్లేడర్‌గా నేను బేరీ పండు ఆకారంలో రెండు విభాగాలు కలిగి ఉంటాను. బాడీ అని చెప్పబడే ముఖ్య భాగం మరియు దాని సన్నపాటి కంఠం నేను సరిగ్గా నీ లివర్ క్రింద ఉంటాను నేరుగా లివర్‌కు అంటిపెట్టుకుని గానీ ఒక చిన్న పాటి కణజాలంతో గాని చేర్చబడి ఉంటాను నా కంఠానికి సిస్టిక్ వాహిక అనే ఒక స్రావక గొట్టంతో లివర్‌లో గల కామన్ హెపాటిక్ డక్ట్ నాళంతో కలిసి ఉంటాను. కామన్ పిత్తవాహికగా ఉంటాను ఈ వాహిక చిన్న ప్రేగులలో డియోడినమ్‌లో డియోడినల్ పాపిల్లా ద్వారా ప్రవేశిస్తాను సమాన పిత్తవాహిక డియోడినమ్‌ను చేరేముందు పాంక్రియాస్ నుంచి పాంక్రియాటిక్ వాహికను కలుస్తుంది ఈ రెండు డియోడినమ్‌ను చేరే ముందు కొంచెం పెద్దవిగా ఆంపుల్లా (Ampulla)గా విస్తరించుకుని ఉంటాయి.

## నీటి పరిమాణం

| | |
|---|---|
| *వాతావరణంలో (సముద్ర మట్టం దగ్గర)* | *- 001 శాతం* |
| *మహాసముద్రాలు మరియు ఇన్ లాండ్ సముద్రాలు (Inland Seas)* | *- 97 2 శాతం* |
| *ఐస్‌కాప్‌లు మరియు గ్లేసియర్స్* | *- 2 15 శాతం* |
| *పరిశుభ్రమైన మంచినీరు (భూగర్భ జలాలు, చెరువులు పై భూమి అంతర్భాగం, నదులు, ప్రవాహాలు)* | *- 64 శాతం* |

*— 'ప్లెయిన్ ట్రూత్' సౌజన్యంతో*

"ద్వేషాన్ని ద్వేషంతో జయించలేం,
క్రోధాన్ని శాంతంతో జయించాలి."

నీ శరీరంలో లివర్‌గా నేను నిర్వర్తించ వలసిన ధర్మాలు ఎన్నో ఉన్నాయి చిన్న ప్రేగులలో పోర్టల్ నాళాల నుంచి వచ్చి చేరే ఆహార పదార్థాలను రసాయనిక చర్యతో మెటబోలైజ్ చేస్తాను. గ్లూకోజ్ (నీకు శక్తిని కలిగించే)ను నేను నిల్వజేసి నీ రక్తప్రవాహంలో నిలకడగా ఉండడానికి సక్రమంగా విడుదల చేస్తూంటాను మాంసకృత్తులు (Proteins) నీ శరీరానికి అత్యవసరమైన కొలెస్టరాల్ (క్రొవ్వు) వంటి పదారాలను కూడా తయారు చేసూంటాను.




నీ రక్తానికి ఒక వడపోత సాధనంగా ఉంటూ విషపదార్థాలను వడకట్టి వ్యర్థ పదార్థాలను నశింప జేస్తూంటాను వీటి అన్నిటికంటే మరో ముఖ్యమైన పని పిత్తరసాన్ని ఉత్పత్తి చేయడం. ఇది నీ జీర్ణ ప్రక్రియకు సహకరిస్తుంది. పిత్తరసంలో పిత్తరస సంబంధమైన లవణాలు, పిత్తరస సంబంధమైన వర్ణపదార్థాలు (పిగ్ మెంట్స్) ఉంటాయి ఈ వర్ణపదార్థాలు ముఖ్యంగా ఎర్రరక్త కణాలలో వ్యర్థ పదార్థాల నుండి తయారవుతాయి

నీలో గాల్‌బ్లేడర్. నేను ఒక ఉగ్రాణపు గది (Store Room)గా ఉంటాను నీ లివర్‌లో ఉత్పాదింపబడిన పిత్తరసాన్ని నిల్వచేసి అందులో ఉండే నీటిని శోషించి పిత్తరసాన్ని మరింత చిక్కపరుస్తాను. దీనివల్ల ఎక్కువ పిత్తరసాన్ని నిల్వ చేయడానికి వీలు కలుగుతుంది నీ లివర్‌లో రోజుకి సుమారు 500 మిల్లీలీటర్ల బైలు పిత్తరసం ఉత్పత్తి అవుతూంటుంది మేమిద్దరం ఒకటిగా కలసి నీ శరీరంలో ఏవిధంగా పనిచేస్తూన్నాం అని తెలుసుకోడానికి నీవు కుతూహల పడవచ్చు. మొట్టమొదట లివర్‌లో గల కణాలు (బైలు) పిత్తరసాన్ని వాహికలోకి ప్రవింపజేస్తాము ఇది నీ డియోడినమ్‌లో చేరుతుంది ఆహారాల మధ్య కాలంలో డియోడినల్ వాహిక రంధ్రం (sphincter of oddi) మూసి ఉంటుంది అప్పుడు పిత్తరసం గాల్ బ్లేడర్‌లోకి ప్రవిస్తుంది ఇక్కడ ఇది నిల్వ చేయబడుతుంది. ఆహారం నీ నోటిలో ప్రవేశించినప్పుడు రంధ్రం చుట్టూ ఉండే స్పింక్టెర్ తెరుచుకుంటుంది ఆహారం డియోడినమ్‌లో ప్రవేశించి గాల్ బ్లేడర్ సంకోచం పొంది నిలువచేయబడిన పిత్తరసాన్ని సిస్టిక్ వాహిక ద్వారా మరియు కామన్ బైల్ వాహిక ద్వారా డియోడినమ్‌లో ప్రవేశించి క్రొవ్వు పదార్థాల జీర్ణ ప్రక్రియకు సహకరిస్తుంది.

నేను పగలు, రాత్రి ఒకే రీతిగా నిరంతరం పనిచేస్తూన్నా నాకు ఆరోగ్యం బాగా ఉన్నంత వరకే సక్రమంగా పనిచేయగలుగుతాను అనేక కారణాల వల్ల నాకు వివిధ వ్యాధులు సంభవిస్తూంటాయి నేను చాలా మృదువుగా ఉంటాను కాబట్టి, నాకు పుష్కలంగా రక్తం

## ప్రపంచపు మిక్కిలి పెద్ద నాణాలు

*పశ్చిమ పసిఫిక్ మహాసముద్రంలో యాప్ ద్వీపాలలో మధ్య రంధ్రం గల గుండ్రని రాతి పలకలు ప్రపంచంలో పెద్ద నాణాలు. ఇవి 12 అడుగుల వ్యాసంతో ఒక్కొక్కటి 185 పౌండ్లు భారం ఉంటుంది. మధ్యరకం నాణెం ఒక్కొక్కదాని విలువ ఒక భార్యకు లేక ఒక చిన్న పడవకు సమానం*

"తన్ను తాను శాసించుకునే శక్తిగల వ్యక్తి లోకాన్ని శాసించగలుగుతాడు."

సరఫరా అవుతూంటుంది కాబట్టి ఉదర భాగంలో గాయం తగిలినా, ఏదైనా హాని కలిగినా వెంటనే పగిలిపోవటం వల్ల ఉదరంలో రక్తస్రావం ఏర్పడుతుంది. ఒక్కొక్కప్పుడు ఎర్ర రక్త కణాల విధ్వంసం వల్ల కణజాలం నాశనం చెందినప్పుడు వ్యర్థ పదార్థాల నుంచి ఏర్పడే బైల్ పిగ్మెంటులు రక్తంలో చేరిపోతాయి. ఎర్ర రక్తకణాలు ఎక్కువగా చెడిపోయినప్పుడు నేను నా పనిని సక్రమంగా నెరవేర్చలేక పోతాను దీని వల్ల నీ కళ్ళు, నీ శరీర చర్మం కూడా కొద్దిగా పసుపు వర్ణం పొందుతాయి.

వైద్యులే గాకుండా అందరూ దీనిని జాండీస్ అంటారు. ఒక్కొక్కప్పుడు ఎక్కువగా ఆల్కహాలిక్ వంటి మద్య పదార్థాలు అధికంగా సేవించినప్పుడు నేను కుదించుకు పోతాను నాపైతలం సమానంగా ఉండదు. అలాటప్పుడు నా పనిని నేను నిర్వహించలేకపోతాను. దీనినే వైద్యులు సిరోసిస్ ఆఫ్ లివర్ (cirrhosis of liver) అంటారు. కొన్ని సమయాలలో వైరస్‌లు, ఇతర పరాన్న భుక్కులు నాలో చేరుతూంటాయి. దీనినే వైద్యులు హెపాటైటిస్ అంటారు కొన్ని అసాధారణ పరిస్థితులలో నాకు కాన్సరు కూడా పట్టుకుంటుంది. కొందరి వ్యక్తుల గాల్ బ్లేడర్‌లో చిన్నరాళ్ళు పేరుకుంటాయి. దీని వల్ల విపరీతమైన నొప్పి ఉంటుంది. ఈ రాళ్ళు సిస్టిక్ వాహికకు గానీ, బైల్ వాహికకు గానీ అంతరాయం కలిగిస్తాయి. అప్పుడు కూడా జాండీస్ సంభవిస్తూంటుంది. వైద్యులు దీనిని కోలోలి తియాసిస్ (gall stones) అంటారు.

నీవు ఆల్కహాల్ వంటి పదార్థాలు త్రాగకుండా ఉంటే నాకు ఎంతో మేలు కలుగుతుంది నీ శరీరం బాగా పెరిగిపోయినా కూడా నాకు హాని కలుగుతుంది. ఎక్కడబడితే అక్కడ తినకుండా, త్రాగకుండా ఉండటం ఎంతో మంచిది. లేకపోతే వైరస్ వ్యాధులు నాకు తగులుతాయి. ఒక్కొక్కప్పుడు శుభ్రం చేయని ఇంజక్షన్ సూదులు, సిరింజ్‌లు కూడా నాకు అపాయం కలిగిస్తాయి లోపల వాచిపోయి బాధ ప్రారంభిస్తుంది. వీటివల్ల పచ్చకామెర్ల రోగం (జాండీస్) సంభవిస్తుంది. కొన్ని కొన్ని సమయాలలో ఇది చాలా తీవ్ర తరంగా పరిణమించి వ్యక్తికి స్పృహ తప్పిపోతుంది, మరణం కూడా సంభవిస్తుంది.

పై ఉదర భాగంలో నీకేదైనా నొప్పి అనిపించినప్పుడు, జీర్ణశక్తి తగ్గిపోయినప్పుడు, ఆకలి మందగించినప్పుడు వైద్యుని సంప్రదించి ఔషధం పుచ్చుకో. నేను నా పనులను సక్రమంగా నెరవేర్చడానికి, నీకు మరింత ఎక్కువగా పరిచర్యలు చేయడానికి నాకు సహకరించమని నిన్ను వేడుకుంటున్నాను.

## కాట్‌ఫిష్ మీసాలతో వాసన రుచి చూస్తుంది




*శరీరం మీద పొలుసులు లేకుండా మంచి నీటిలోను, సముద్రంలోను నివసించే కాట్‌ఫిష్‌లు అమెరికాలో విస్తారంగా ఉంటాయి. ఇవి వాటి నోరుచుట్టూ, తోకదగ్గర, ఫిన్ రెక్కలు చుట్టూ శరీరం మీద ఉండే మీసాలతో ఆహారాన్ని రుచి చూస్తాయి, వాసన చూస్తాయి.*

"తన్ను తాను ఉద్ధరించుకునే వ్యక్తి లోకోద్ధరణకు సమర్థత కలిగి ఉంటాడు."

# విజ్ఞానదీపిక

## గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా



మంగోలియా మైదానం దక్షిణదిక్కు అంచున కాన్సు (Kansu) మండలం నుంచి ఎల్లో సముద్రం మీద ఉన్న హొపె (Hopeh) మండలం వరకు 2400 కి.మీ.ల పొడవైన చైనా పెద్ద గోడను (గ్రేట్ వాల్ ఆఫ్ చైనా) నిర్మించడానికి 1,700 సంవత్సరాలు పట్టింది ఇది మొట్టమొదట ఊరు ఊరు తిరిగే ద్రిమ్మరి జాతుల దాడులను నిరోధించడానికి బిసి 3వ శతాబ్దంలో నిర్మించబడింది

## సోషలిజం మరియు కాపిటలిజం




దేశంలో పారిశ్రామిక, వ్యాపార మరియు ఆర్థిక వ్యవస్థలను పాలక వర్గాధికారంతో నిర్వహిస్తూ, రాజ్యంలో ప్రజల సంక్షేమ బాధ్యతలను వహించే రాజకీయ, ఆర్థిక సిద్ధాంతం సోషలిజం. ఉత్పత్తి, వితరణ మరియు వస్తువినిమయ విధానాలు ప్రజల ఆధీనంలో ఉంచే ఆర్థిక లాభ నియంత్రణాధికార సిద్ధాంతం కాపిటలిజం లేక పెట్టుబడిదారీ విధానం

## భారతదేశపు జాతీయగీతం




భారతదేశపు జాతీయగీతమైన 'జనగణమన' మొట్టమొదట 1911 డిసెంబరు 27న కలకత్తా కాంగ్రెస్ సమావేశంలో పాడబడింది. ఇది 1912 జనవరిలో 'భారత్ విధాత' అనే శీర్షిక క్రింద రవీంద్రనాథ్ ఠాగూర్ స్వీయ సంపాదకత్వంలో ఉన్న 'తత్వ బోధినీ' పత్రికలో ప్రచురింపబడింది. దీనిని 1919లో ఠాగూరే ఆంగ్లంలోకి 'Morning song of India' అనే శీర్షికతో అనువ దించారు ఇందులో అయిదు చరణాలు ఉంటాయి

## ఉత్తరధృవం చేరిన మనిషి

కమాండర్ రాబర్ట్ పియరీ 1909 ఏప్రిల్‌లోన ఉత్తర ధృవం చేరిన మొదటి మనిషి

"తనకు తాను గురువైన వ్యక్తి లోకగురువు కాగలుగుతాడు"

—జిడ్డు కృష్ణమూర్తి

# లధక్

సీమా భట్

లధక్ అతి తక్కువ మరియు అత్యధిక ఉష్ణోగ్రతలు కలిగిన ఒక వింత ప్రదేశం. లధక్ లేక 'లాండ్ ఆఫ్ పాసెస్' (కనుమ మార్గాల ప్రదేశం) సుమారు 2900 మరియు 5900 మీటర్ల ఎత్తుగా ఉండే ట్రాన్స్ హిమాలయా పర్వతశ్రేణులలో ఉంది ('ల' అంటే మార్గం, 'డక్' అంటే భూప్రదేశం). ఎడి399 లో చైనా యాత్రికుడు ఫాహియాన్ దీనిని వర్ణిస్తూ



ఇక్కడ మంచు ఎన్నడూ కరుగదు, ధాన్యపు కంకులు పండుతాయి' అన్నాడు. ఇచ్చట ఉష్ణోగ్రతలో కనిపించే విపరీతమైన మార్పులను బట్టి ఇతడు ఈవిధంగా వ్రాసి ఉండవచ్చు

రాజకీయంగా ఇది భారతదేశంలో ఒక భాగమైనా జాతిపరంగానూ, భౌగోళికంగానూ ఇతరదేశాల కంటే ఇది విభిన్నంగా ఉంటుంది. వేషభాషలలో, శిల్పరచనా విధానంలో, దేశ పురాణగాధలలో-పొరుగు రాజ్యమైన టిబెట్ సంస్కృతికి అతి సన్నిహితంగా ఉంటుంది ఈ రెండు ప్రదేశాలలోను టిబెటన్ మహాయాన బౌద్ధమతం బహుళ ప్రచారంలో ఉంది లధక్ జనాభా సుమారు 52 శాతం బౌద్ధ మతస్థులు, 36 శాతం ముస్లిములు, 12 శాతం హిందూ మరియు ఇతర మతస్థులు. లధక్ 95, 876 చ కి మీ ల వైశాల్యంతో 1,32,000 పైబడిన జనాభా కలిగి ఉంటుంది. మిక్కిలి ఎత్తయిన ప్రదేశాలలో లధక్ ప్రపంచంలో ఎక్కువ జనసాంద్రత గల ప్రదేశంగా పేరు పొందింది.

సాలీనా అతి తక్కువ (92 మి.మీ.) వర్షపాతంతో ఇచ్చటి భూప్రదేశం పర్వతమయమైన ఎడారిగా భావించబడుతుంది. ఇక్కడ నివసించే లధకీలు ఈ ఎడారి పరిస్థితులకు అలవాటు పడిపోయారు వీరు కరిగిన మంచు నీటితో పంటలు పండించుకుంటారు చిన్న చిన్న కాలువలు త్రవ్వి వాటి ద్వారా మంచు నీటిని 4000 మీటర్ల ఎత్తయిన పీఠ భూములకు ప్రవహింపజేసి ముఖ్యంగా బార్లీ మరియు అవాలు విస్తారంగా పండిస్తారు. అక్కడక్కడ కొండవాలుల మీద (సూచీ ఆకారపు) చెట్లే ఇక్కడి సహజవృక్షావరణ

## ప్రపంచంలో బ్రహ్మాండమైన పక్షి

*ప్రపంచంలో బ్రహ్మాండమైన పెద్ద పక్షి ఉత్తర ఆఫ్రికా నిప్పుకోడి (Ostrich) ఇది సాధారణంగా అట్లాస్ పర్వతాలకు దక్షిణంగా ఆఫ్రికాలో అప్పర్ సెనెగాల్ నుండి నైజర్ దేశం మీదుగా సూడాన్ మరియు మధ్య ఇథియోపియా వరకు గల ప్రదేశంలో నివసిస్తాయి ఈ ఎగురలేని పక్షులలో మగవి సుమారు 9 అడుగుల ఎత్తుగా, 345 పౌండ్ల భారంగా ఉంటాయి.*

"సుఖము ఒక 'తీతువు' పక్షిలాంటిది. దానిని పట్టుకోడానికి ప్రయత్నిస్తే అది చిక్కదు. కానీ మనం శాంతచిత్తులమైతే అదేస్వయంగా వచ్చి మనమీద వాలగలదు"

ఇది వివిధరకాల అపూర్వ జంతువులకు ఆశ్రయంగా ఉంది. వాతావరణానుకూలంగా ఇక్కడ నివసించే స్నోలెపర్డ్ మిక్కిలి అపురూపమైనది. తోడేళ్లు, నక్కలు సర్వసామాన్యంగా కనిపించే లథక్ జంతువులు అతి విస్తారంగా అడవి గొర్రెలు, మేకలు ఇక్కడ నివసిస్తాయి.


Buddha

ఒకే కుటుంబంలో ఇద్దరు లేక అంతకన్నా ఎక్కువమంది సోదరులు ఒకే భార్యతో కాపురం చేసే ఆచారం ఒకప్పుడు ఇక్కడ ప్రచారంలో ఉండటం అనేది జనాభా చాలా తక్కువగా ఉండడానికి ముఖ్యకారణం. కుటుంబంలో పెద్ద కుమారునికి మాత్రమే ఆస్థి సంక్రమించేది ఈ సాంఘిక ఆచారాలు ఇప్పుడు ఇక్కడ లేవు.

పూర్వంలాగే నేడు కూడా లథక్‌లో ప్రజల మీద బౌద్ధమత ప్రభావం విస్తారంగా ఉంది. బౌద్ధమతం జీవహింసను నిరాకరించడం వల్ల ఇక్కడ అడవి జంతువులు బాగా వృద్ధి పొందాయి ఇక్కడి విపరీత శీతోష్ణస్థితి పరిస్థితుల వల్ల, ఒక ప్రాణి మరో ప్రాణిని తినడం వల్ల, పశువుల సంఖ్య తక్కువగా ఉండటం వల్ల మేత అధికంగా వినియోగపడదు లభించే వనరులు పునర్వ్యవస్థీకరణ విధానంలో ఉపయోగపడుతున్నాయి. పశువుల పేడ, మానవులకు ఉపయోగపడని వ్యర్థపదార్థాలు అతి జాగ్రత్తగా సంగ్రహింపబడి పొలాలలో ఎరువుగా ఉపయోగిస్తారు.


SNOW LEOPARD

నేడు లథక్‌లో అతి శీఘ్రంగా మార్పులు ఏర్పడుతున్నాయి క్రొత్త క్రొత్త రోడ్లు నిర్మించబడ్డాయి. అతి సులువుగా ప్రయాణ సౌకర్యం ఏర్పడింది లథక్‌లో టూరిస్ట్ పరిశ్రమ బాగా అభివృద్ధి చెందింది పర్వతారోహణ మరియు బౌద్ధ దేవాలయాలు వీరి ముఖ్య ఆకర్షణలు

●

## ధర్మం అంటే ఏమిటి?

మానవుడు తన కోరికలు, ఆకలి దప్పులు తీర్చుకుని నివసించడానికి ఒక ఇల్లు నిర్మించుకోడానికి ప్రయత్నిస్తాడు. ప్రతి వ్యక్తికి తన కోసం, సమాజం కోసం, దేశం కోసం, చివరిగా ప్రపంచం కోసం అనుసరించవలసిన ధర్మాలు ఎన్నో ఉన్నాయి. సామాన్యంగా ఈ ధర్మాలను ఆచరించడం అనేది లౌకికమైన మానవ సంతృప్తికి మాత్రమే తగినట్లు ఉంటాయి వీటిని పారమార్థికాభివృద్ధి పొందేటట్లుగా ఆచరించడమే ధర్మం

— శ్రీ కంచి శంకరాచార్య

"జన్మతః మానవులంతా సమానం కావచ్చు. స్వభావతః మనుష్యులందరు ఒకటిగా ఉండరు. కనుక అందరిని ఒకే విధంగా చూడడం వ్యర్థం."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 ఈ క్రింది వారిని గురించి మీకేమి తెలుసు? (ఎ) డా జాకీర్ హుస్సేన్, (బి) కింగ్‌జార్జ్ VI, (సి) అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్

2 వీటిని కనిపెట్టినవారు ఎవరు? (ఎ) సంకలన సాధనం (Adding machine), (బి) ఎక్స్-కిరణసాధనం (X-Ray machine)

3 ఉరుము శబ్దానికి ముందు మెరుపు ఎందుకు కనిపిస్తుంది?



4 టాక్సీడెర్మీ (Taxidermy) అంటే ఏమిటి?

5 టర్కీలో కాన్‌స్టాంటినోపిల్ క్రొత్తపేరు ఏమిటి?

6 మర్చెండైజ్ (merchandise) అంటే ఏమిటి?

7 మంత్రివర్గం (Cabinet of Ministers) అంటే?

8 నామ్‌చీ (Namchi) అంటే ఏమిటి?

## మాటల మహిమ

1 చాంధసుడు: (ఎ) కార్తికేయుడు, (బి) శ్రోత్రియుడు, (సి) లోకజ్ఞానం లేనివాడు, (డి) మేకను పెంచువాడు.

2 జట్టి (ఎ) విలువ, (బి) అమ్మకము, (సి) బేరము, (డి) అమ్మకపు సరకు

3 జోలి (ఎ) సంగతి, (బి) పని, (సి)గాథ, (డి) ఉయ్యాల

4. తీవరము (ఎ) కోపము, (బి) చిరాకు, (సి) వేగము, (డి) తీగ

5 చిక్కు (ఎ) ఆపద, (బి) సంశయము, (సి) ముడి, (డి) మెలిక

## జపానులో వృద్ధులకు ఎంతో గౌరవం, మర్యాద

బహిరథన్

*జపానులో వృద్ధులు ఎక్కువగా గౌరవింపబడే వ్యక్తులు వృద్ధులకై ఏర్పాటైన ప్రత్యేక మార్గాలలో వీరు నిర్భయంగా నడవవచ్చు, రోడ్డును దాట వచ్చు ఏ టాక్సీ డ్రైవరైనా రోడ్డు మీద వృద్ధుణ్ణి చూస్తే టాక్సీ ఆపి దిగి ఆ వృద్ధుణ్ణి రోడ్డు దాటించి వెడతాడు*

*హోటళ్ళలో 'వృద్ధుల విభాగం' ప్రత్యేకంగా ఉంటుంది ఇక్కడ వీరు నెమ్మదిగా, విశ్రాంతిగా కూర్చుని నిశ్చింతంగా తినవచ్చు చార్జీలు అంత మాత్రంగానే ఉంటాయి ఇతరులకు చేసే ఛార్జీలలో 10వ వంతు మాత్రమే క్యూలో నుంచున్న యువకులు వృద్ధులను గానీ, స్త్రీలను గానీ చూస్తే వెంటనే వారికి తమ స్థానాన్ని ఇస్తారు రైళ్ళలో గానీ, బస్‌లలో గానీ యువకులు వృద్ధులను చూస్తే వెంటనే లేచి కూర్చోడానికి తమ సీటును ఇస్తారు.*

*ఎందుకు ఇలా చేస్తారని ఒక జపాన్ పౌరుని అడిగితే వారు ఆరోగ్యంగా యౌవ్వనంలో ఉన్నప్పుడు దేశానికి చేసిన సేవను మేము ఈ విధంగా గుర్తిస్తాం అని చెప్పాడు*

*మన దేశంలో కూడా జపాను పద్ధతిని ఎందుకు అవలంబించకూడదు?*

*— 'కిసాన్ వరల్డ్' సౌజన్యంతో*

"పనే చేయకుండా జీవితాన్ని వృధా చేసుకోవడం కంటే పనులు చేస్తూ పొరపాట్లు చేయడం కూడా మంచిదే." —బెర్నార్డ్ షా

6 కైపు: (ఎ)మత్తు, (బి) సారాయి, (సి)కపటము, (డి) అందము

7 గోము- (ఎ)గారాబము, (బి) గౌరవము, (సి) గర్వము, (డి) సౌకుమార్యము

8 గంటు (ఎ)ముడి, (బి) గాయము, (సి) గునుపు,- (డి) మూటముడి.

## తెలివికి పరీక్ష

1 లక్ష్మయ్య ఎవరు?

2. తలలు మార్చే దగాకోరు తోచనిస్థితిలో ఉన్నప్పుడు ఏమవుతాడు?

3 ఒకరిని ఆశీర్వదించడానికి, దీవించడానికి తలమీద అక్షింతలు జల్లితే దూషించడానికి ఏంవేస్తారు?

4 తలపెట్టిన పని ఏదైనా అత్యంత ప్రమాదకరమూ, అసాధ్యం అయినప్పుడు అవని ఏమవుతుంది?

5 చిట్టిబాబు మామయ్యా - రామూని, పెంపుడు కుక్క టామీని షికారు తీసుకెడుతూ దారిలో వెయింగ్ మెషీన్ కనిపిస్తే అందరూ దానిమీద ఎక్కారు ఆమెషీన్ 125 కి.గ్రా.లు సూచించింది. టామీ భారానికి నాలుగురెట్లు రాము భారం, రాము బరువుకు రెట్టింపు కావడానికి మామయ్యా 5 కి.గ్రా లు తక్కువ బరువు అయితే ఒక్కొక్కరి భారమెంత?

(జవాబులకు వ పేజీ చూడండి)




## నడక వల్ల కలిగే లాభాలు



1 ఎథీరోస్క్లెరోసిస్ (atherosclerosis)అభివృద్ధిని మందగింప జేయడానికి సహకరిస్తుంది.

2 రక్త ప్రవాహాన్ని అభివృద్ధి చేస్తుంది రక్తపు ఒత్తిడిని క్రమబద్ధం చేస్తుంది

3 కండ శక్తిని పెంచి బలాన్ని కలిగిస్తుంది.

4 శరీరంలో వివిధ అంగాల వ్యాపారాన్ని సరళవంతం చేస్తుంది.

5 శరీరంలో శక్తి వినియోగపు ప్రమాణాన్ని అధికపరుస్తుంది.

6. శరీరంలో ఎముకల బలాన్ని వృద్ధి చేసి ఆస్టియోపోరోసిస్ (osteoporosis) వేగాన్ని తగ్గిస్తుంది.

7 ఉత్పాదక శక్తిని వృద్ధిపరుస్తుంది.

8 మధుమేహాన్ని నిరోధిస్తుంది.

9 మానసిక ప్రయాసను, ఒత్తిడిని తగ్గిస్తుంది.

10 మానసిక శక్తులను పూర్తిగా వినియోగింప

11 ఉత్సాహం కలుగజేస్తుంది ఆరోగ్యంగా ఉన్నానని అనిపిస్తుంది.

12 వృద్ధాప్యం వెనుకబడుతుంది.

"పదవులను స్థానాలను బట్టి వ్యక్తిత్వం పెరగదు. వ్యక్తిత్వాన్ని బట్టి పదవులకు, స్థానాలకు విలువ పెరుగుతుంది." —సిసిరో

# ప్రపంచ రైల్వేలు

## ఎలక్ట్రిక్ బాటరీతో నడిచిన రైలు ఇంజను



ఆంగ్లేయ కల్పనా చతురుడు రాబర్ట్ డేవిడ్సన్ ఎలక్ట్రిక్ బాటరీతో నడిచే రైల్ ఇంజనును కనిపెట్టాడు ఇది 1843లో ఎడిన్‌బర్గ్ మరియు గ్లాస్గో రైలు మార్గంలో నడుపబడింది.

## విద్యుచ్ఛక్తితో నడిచిన మొదటి రైలుబండి



మొట్టమొదట దిగ్విజయంగా విద్యుచ్ఛక్తితో నడుపబడిన రైలుబండిని వెర్నెర్ వాన్ సీమెన్స్ 1879లో నిర్మించి జర్మనీ బెర్లిన్‌లో ప్రదర్శించాడు. ఇతడి కంపెనీ 1881లో ప్రపంచపు మొట్టమొదటి పాసింజర్ ఎలక్ట్రిక్ రైల్వేను జర్మనీ లిచెపెర్ ఫెల్డేలో నిర్మించింది. ఆ తరువాత బ్రిటన్ (ఇంగ్లండ్) లోను ఎలక్ట్రిక్ రైళ్ళను ప్రారంభించారు.

## ప్రపంచంలో మొట్టమొదటి పూర్తి ఎయిర్ కండిషన్డ్ రైలు

ప్రపంచంలో మొట్టమొదటి పూర్తి ఎయిర్ కండిషన్డ్ రైలు యుఎస్ఎలో బాల్టిమోర్ మరియు ఓహియో రైలురోడ్డు వారిచే 1931లో నడుపబడింది

## ప్రపంచంలో మొట్టమొదట ఆవిరితో నడిచిన రైలు ఇంజను



లండన్ మరియు నార్త్ ఈస్టర్న్ రైల్వే (1922-41)కి హెర్బెర్ట్ నైగల్ గ్రెస్లే చీఫ్ మెకానికల్ ఇంజినీరు ఇతడు 'ది ఫ్లైయింగ్ స్కాట్స్‌మన్'ను రూపొందించాడు ఇదే ప్రపంచంలో మొట్టమొదట ఆవిరితో నడచిన రైలు ఇంజను - గంటకు 100 మైళ్ళు ప్రయాణం చేసింది.

---

"మనిషి మాట తీరును బట్టి అతని మేధాశక్తి అంచనా వేయవచ్చు
సరళంగా, సున్నితంగా, హృద్యమంగా మాట్లాడగలిగిన వ్యక్తి
హృదయం కూడా అంత నిర్మలంగా ఉంటుంది." —బ్రూస్ బార్టన్

## మొట్టమొదటి పబ్లిక్ రైల్వే సర్వీస్

యునైటెడ్ కింగ్‌డమ్ సౌత్‌వేల్స్‌లో స్వాన్‌సీలో ఆయిస్టర్‌మౌత్ రైల్వే మొట్టమొదటి పబ్లిక్ రైల్వే సర్వీస్ ఇది 1807లో ప్రారంభింపబడింది ప్రయాణీకుల వద్ద ఛార్జీలను వసూలు చేసి వారికి ప్రయాణ సౌకర్యం కలిగించింది ఇది గుర్రంతో లాగబడింది

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తయిన రైలుమార్గం



పెరూలో సెంట్రల్ రైల్వే ప్రపంచంలో మిక్కిలి ఎత్తయిన రైలు మార్గం. ఇక్కడ ముఖ్య మార్గం గాలేరా సొరంగంలో సముద్ర మట్టానికి 15,688 అడుగుల ఎత్తుగా ఉంటుంది. ఈ రైలు మార్గంలో టిక్లియో రైలుస్టేషన్ సముద్ర మట్టానికి 15,685 అడుగుల ఎత్తున ఉంటుంది.

## ఉత్తర అమెరికాలో 250,000 మైళ్ళ రైలుమార్గం

19వ శతాబ్దం చివరి భాగంలో యునైటెడ్ కింగ్‌డమ్‌లో సుమారు 22,000 మైళ్ల రైలుమార్గం, యూరప్‌లో 180,000 మైళ్ళ రైలుమార్గం ఉన్నాయి. ఉత్తర అమెరికాలో 250,000 మైళ్ళు పైబడి రైలుమార్గం ఉండేది.

## ప్రపంచంలో అత్యధిక రైల్వే మైలేజి

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో ప్రపంచంలో అత్యధిక రైల్వే మైలేజి - 210,000 మైళ్ళు పైబడి ఉంది యు ఎస్ ఎస్ ఆర్ 160,000 మైళ్ళతో ద్వితీయ స్థానాన్ని పొందుతూంది. పశ్చిమ యూరపులో ఫ్రాన్స్‌లో 22,000 మైళ్ళ రైలుమార్గం ఉంది

## రైలుమార్గాలలో ఉపయోగించే గేజి ప్రమాణాలు



రైలుమార్గంలో సాధారణంగా ఎక్కువ విస్తారంగా ఉపయోగించే గేజి (రైలుపట్టాల మధ్య దూరం) 5 అడుగుల 6 అంగుళాలు ఈ వెడల్పు ఇప్పుడు స్పెయిన్, ఇండియా, బంగ్లాదేశ్, శ్రీలంకా, పాకిస్థాన్, అర్జెంటీనా, చైలీలలో ఉపయోగించబడుతూంది. యుఎస్ ఎలో ఒరెగాన్‌లో ఒక లంబర్ రైలుమార్గం 1885లో 8 అడుగుల వెడల్పు ఉంది!

## ఫ్రాన్స్‌లో 1880లో డబుల్‌డెకర్ రైళ్ళు ఉపయోగించారు

1880లో మొట్టమొదట ఫ్రాన్స్‌లో డబుల్ డెకర్ రైళ్ళను ఉపయోగించారు. విశిష్టరకపు డబుల్‌డెకర్ కారేజీలు 1899లో ఉపయోగింప బడ్డాయి. ఇవి 1923 వరకు నడిచాయి.

"మనకు అపకారం చేసినవాడి మార్గాన్ని మనంకూడా అనుసరించకుండా నిగ్రహంతో ఉండటమే మన ఉత్తమ ప్రతీకారం అవుతుంది."

—డేసీ పోర్టర్

## జర్మనీలో మోనోరైళ్ళు విజయవంతంగా నడుస్తున్నాయి



జర్మనీలో మోనోరైళ్ళు అంటే ఒకేఒక ఇనుప పట్టా మీద నడిచే రైలు విజయవంతంగా నడుస్తూంది. ఇప్పుడు జర్మనీలో ఉప్పెర్టాల్‌లో ఏక కమ్మీ రైలుమార్గం ఉపయోగంలో ఉంది. పెద్ద ఉక్కు గర్డరుకి ఇరుప్రక్కల కోచీలు వ్రేలాడుతూంటాయి

## మొట్టమొదటి డీసెల్ ఎలక్ట్రిక్ రైళ్ళు

మొట్టమొదట డీసెల్, ఎలక్ట్రిక్ రైళ్ళు స్వీడెన్‌లో ఉపయోగింపబడ్డాయి. యుఎస్ఎస్ఆర్‌కి ఒక జర్మన్ కంపెనీ బ్రహ్మాండమైన పెద్ద డీసెల్ రైలు ఇంజనును 1924లో నిర్మించింది అయితే యుఎస్ఎలో మొట్టమొదట డీసెల్ రైలు బాగా ప్రచారంలోకి వచ్చింది. 1934లో మొట్టమొదట యునైటెడ్ కింగ్‌డమ్‌లో డీసెల్ కార్లు ఉపయోగింపబడ్డాయి.

## ఆవిరియంత్రంతో లాగబడిన మొదటి రైలు

మొట్టమొదట స్టాక్‌టన్ మరియు డార్లింగ్‌టన్ రైల్వే ఆవిరియంత్రంతో లాగబడే రైలులో ప్రయాణీకులను తీసుకువెళ్ళింది. 1825లో మొట్టమొదటి ప్రయాణీకులను తీసుకువెళ్ళే ఈ ఇంజను గంటకు 15 మైళ్ళు వేగంతో నడిచింది

## ప్రపంచంలో వేగవంతమైన రైలుబండి



ప్రపంచంలో అధికవేగవంతమైన రైలు బండి ఫ్రాన్స్‌లో పారిస్ నుంచి లాయన్స్ వరకు గల 426 కి.మీ.ల దూరం 160 నిమిషాలలో ప్రయాణం చేసింది సన్నగా కోసుగా ఉండడం చేత, లో ప్రొఫైల్ (low profile) వల్ల ఇవి మామూలు రైళ్ళ కంటే తక్కువ శబ్దంతో ప్రయాణం చేస్తాయి

## అభివృద్ధి పొందుతూన్న దేశాలలో 50 శాతం పురుషులు సిగరెట్లు కాలుస్తారు

*పశ్చిమ దేశాలలో సిగరెట్లు కాల్చే అలవాటు మానుకున్న ప్రతీ వ్యక్తికి అభివృద్ధి పొందుతూన్న దేశాలలో ఇద్దరు కాల్చడం అలవాటు చేసుకుంటున్నారు అభివృద్ధిపొందుతూన్న దేశాలలో 50 శాతం పురుషులు, 5 శాతం స్త్రీలు అందరూ సిగరెట్లు కాల్చేవారే. అభివృద్ధి పొందిన పశ్చిమ దేశాలలో వీరి సగటు 30 శాతం మాత్రమే*

*—డా జె పి వాలి*

"సముద్రంలో ఒకసారి మునగగానే రత్నాలు దొరకకపోతే సముద్రం రత్నహీనం అనబోకు." —రామకృష్ణ

# జీవితాన్ని జీవితం

మనకు సుఖంగానీ, సంతోషం గానీ కలిగించే వాటి విషయంలో మనం పొందే మానసికస్థితి రాగం. ఈ వస్తువు నాకులేదు అనే భావన ఉన్నప్పుడు దానిని నేను పొందాలి, దానిని రక్షించుకోవాలి అనే ఉబలాటం బయలు దేరుతుంది. ఇదంతా అభిమానం వల్ల వుడు తుంది. అభిమానం అనేది సంస్కృత పదం. ధనం, కులం, బలం మొదలైన వాటివల్ల మనలో ఏర్పడే దర్పం, గర్వం, ఆత్మగౌరవం, ప్రేమ మొదలైనవన్నీ అభిమానం అనిపించు కుంటాయి, తనది అనుకుని అభిమానంతో చూడడం అభిమానించడం అభిమానం కలవాడు అభిమాని. అభిమానం కల ఆడది అభిమానకత్తె ఒక వస్తువు గానీ, ఏద్రైనా ద్రవ్యం గానీ కళ్ళ ముందర కనిపిస్తుంది కనిపించిన వెంటనే మనస్సులో ఆలోచన బయలుదేరుతుంది. ఆ వస్తువు నాది, అది నా కోసం, అంతానేనే, అంతా నాకోసమే అనేదే అభిమానం

ఇటువంటి అభిమానం ఒక్క మానవులకే కాదు. ప్రాణులన్నిటికీ సహజమే మానవులలో ఈ అభిమానం సాధారణ పరిధిని మించిపోయి అసాధారణంగా పరిణమిస్తూంటుంది. అప్పుడు అది అహంకారంగా మారిపోతుంది.

ఈ అహంకారమే 'నేను' అనే అభిమానం లేక గర్వం వల్ల మనస్సులో క్రోధం చెలరేగుతుంది అహంకారం కలవాడు అహంకారి గర్వపడటం. అహంకరించడం. అహంకృతుడు గర్వం కలవాడు. అహంభావంతో ఉండడం అహంకరించడం, అభిమానమే అహంకారంగా పరిణమించినప్పుడు మనబుద్ధి ఏంచేయాలో నిశ్చయించు కుంటుంది అహంకారం మనస్సును జిడ్డులా పట్టుకుంటుంది. వదిలించుకోవడం దుర్లభం. అంతేగానీ అసంభవం కాదు. నిష్కావట్యంగా ప్రవర్తించడం అభ్యాసం చేసుకోవాలి. స్వభావాన్ని మరింత సరళవంతం చేసుకోవాలి అహంకారం అనే దానివల్ల లేని దానిని పొందాలి అనుకుంటా ఇదంతా మానసిక భావం మాత్రమే. అహంకా ఎప్పుడైతే తగ్గుముఖం పడుతుందో - వెంటనే పొందాలి, రక్షించుకోవాలి అనే రాగాలు వాటంతట అవే క్షీణించిపోతాయి లోపల అహంకారం నిప్పురవ్వలాగా రగులుతూన్నప్పుడు రాగంపైకి కనిపిస్తుంది లోపల అహంకార జ్వాల ఆరిపోతే అసలు ఆకాంక్షే ఉండదు వాస్తవంగా లేనిపోని కోరికల వల్ల అహంకారం పుట్టడంలేదు. అహంకారం వల్లే దానిని సంపాదించు కోవాలి, రక్షించుకోవాలి అనేదానికి మూలకారణం అవుతూంది వివేకజ్ఞానం లేకపోవడం వల్ల అభిమానం ఏర్పడుతుంది సదసద్వివేచనా శక్తి లోపిస్తే అంతర్దృష్టి లోపిస్తుంది. వెంటనే అభిమానం జనిస్తుంది. కాబట్టి అవివేకం వల్ల అభిమానం కలుగుతుంది అని చెప్పుకోవాలి. దీనివల్ల అహంకారం ఏర్పడుతుంది. అందరూ వివేకవంతులైపోతే అసలు అహంకారానికే తావు ఉండదు. అవివేకాన్ని పోగొట్టుకుంటే పరమసత్యం గోచరిస్తుంది. అప్పుడే జీవితం జీవితంలాగా గుర్తించగలుగుతాం

—'వాధూల'

## ఇంట్లోనే దీపం వెలిగించాలి

నీవు ఇతరులకు సహాయకరంగా ఉండాలంటే నీ అంతట నీవు ఉద్యమం ప్రారంభించాలి. ఇతరులకు ఉత్సాహం కలిగించే కాంతిని నీవు నీ ఇంట్లో ప్రారంభించాలి.

— ఇగ్నేషియస్ లయోలా

'బద్ధకం దారిద్ర్యానికి, కష్టాలకు తండ్రి.''

# మందుకాని మందు

ఆండ్రూ స్టూవార్ట్

మానసిక మరియు శారీరక ఆరోగ్య సౌభాగ్యానికి సంగీతం మందు కాని మందు. ఆధి వ్యాధుల నివారణకు అనేక మంది వైద్యులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు కూడా సంగీతానికి అద్భుత మైన శక్తులు ఉన్నాయనే నిర్ణయానికి వచ్చారు.

మానవుని మెదడులో మొట్టమొదట అంతఃపురం వంటి థాలమున్ (Thalamus) సుశ్రావ్యమైన స్వర శబ్దాలకు ప్రభావితం అవుతుంది అని తెలుసుకున్నారు.



మన మనస్సులో అనుభూతులకు, ఇంద్రియ జ్ఞానానికి, ఆవేశాలకు, స్పర్శజ్ఞానానికి ఇదే ముఖ్య నాడీ కేంద్రం కాబట్టి సంగీత స్వరాలు అనుకూలవంతంగా గ్రహించబడినప్పుడు వ్యక్తి గతంగా అనేక లాభకరమైన మార్పులకు అవకాశం ఉంటుంది.

వాస్తవంగా సంగీతం బయలుదేరిన వెంటనే మన మెదడు లోలోపలకు ప్రవేశించ డానికి శక్తి కలిగి ఉంటుంది. విశిష్టమైన శమనశక్తి కలిగి ఉత్తమరీతిలో మెదడును తేటపరుస్తుంది అంటే సందేహం లేదు.

మాన్‌హట్టాన్ స్టేట్ హాస్పిటల్ సూపరిం టెండెంటు, సుప్రసిద్ధ అమెరికన్ మనస్తత్వ శాస్త్రజ్ఞుడు డా. ఎమ్మిట్ డెంట్ అనేక సంవత్సరాల పాటు సంగీత వైద్యంతో అనేక మానసిక రోగులకు చికిత్స చేసి వారి వ్యాధులను కుదిర్చాడు.

అతి ఉచ్చ, అతి తగ్గు స్థాయిలో గా మధ్యమ స్థాయిలో సుశ్రావ్యమైన సంగీతాని వినిపించినప్పుడు రోగిలో అమోఘమైన అత్యద్భు

## సుభాషితాలు

*కూడి వరవశంపు కోర్కెలు లేకుండ*
*నాటవలెను బుద్ధినయముగాను*
*చోటుగనని వెలుగు జొచ్చుటే మోక్షము*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[అనవసరమైన లేనిపోని కోరికలు లేకుండ మనస్సును వశం చేసుకుని దేవునిపైన నిలిపి ఆత్మకాంతిలో కలిసిపోవడమే మోక్షం.]*

* * *

*ఎరిగిన శివపూజ యెన్నడు చెడిపోదు*
*మొదట బట్టువట్టి వదలరాదు*
*మొదలు విడిచి గోడ తుది బెట్టగల్గునా?*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[ఏపనైనా పట్టుదలతో చేస్తేనే సాధ్యమవుతుంది మొదట ఉపేక్షించి తరువాత పట్టుదల ఉంటే లాభంలేదు. గోడను క్రిందనుంచి గాని పైనుంచి పెట్టలేం కదా!]*

"అన్యాయం, అత్యాచారం చేసేవాడికంటే
దానిని సహించే వాడే గొప్ప దోషి."

పరిణామాలు ఏర్పడ్డాయి. అమెరికాలో శారీరక వ్యాధులతో బాధపడే రోగులకు, మానసిక రోగులకు సంగీతం వినిపించి రోగాలు కుదిర్చే పద్ధతి నేడు బహుళ ప్రచారంలోకి వచ్చింది

శబ్దాడంబరం లేని మృదుమధురమైన సంగీతం వినిపించి శ్రోతల మనస్సులలో వివిధ మనోభావాలను ఉత్తేజపరచవచ్చు ఆధునిక జీవిత సమస్యలతో అనేక ఒత్తిడులతో భ్రమించిపోయే మనస్సుకు సంగీతం ఉపశాంతిని కలిగిస్తుంది ఇది పిల్లల మనస్సుల మీద కూడా ప్రతిభావంతంగా ఉంటుందని తెలుసుకోబడింది

అనుభవజ్ఞుడైన ఒక ఉపాధ్యాయుడు 'మ్యూజిక్ పీరియడులలో సంగీత ప్రియుడైన విద్యార్థి మిగతా పాఠాలను అతి ఉత్సాహవంతంగా నేర్చుకోగలుగుతున్నాడు' అని చెబుతున్నాడు.

మానవులకు జీవిత ప్రారంభం నుంచీ సంగీతం ఆరోగ్యాన్ని, సంక్షేమాన్ని చేకూరుస్తుంది ఉయ్యాలలో ఊగుతున్న బిడ్డ కూడా లయబద్ధమైన జోలపాటకు ఉత్సాహం పొందుతుంది అంటే ఆశ్చర్యం లేదు సంగీతం ఒక శాంతి సుఖాలకే కాదు - శారీరక, మానసిక శక్తులను అభివృద్ధి చేసి వ్యక్తి పెరుగుదలకు ఎంతో సహకరిస్తుంది.

## మంత్రం ప్రాధాన్యత



మంత్రం అనేది వివిధ పదములతో కూర్చిన దేవతాస్తోత్రం ఆలోచనా తరంగాల యొక్క విద్యుదయస్కాంత శక్తినిగాని లేక మంత్ర సంబంధమైన కంపనలను గానీ తెలిసినవారే మంత్రం వల్ల శబ్దతరంగాలు జనిస్తున్నాయని చెప్పగలుగుతారు సక్రమ తరంగ దైర్ఘ్యంగల తరంగమే ఉత్తమ ఫలితాలను ప్రభవింపజేస్తుంది. సాధారణంగా ఈ మంత్రాలు సంస్కృతంలో ఉంటాయి భాషాజ్ఞానం లేకపోయినా సంస్కృతంలో స్తోత్రాలను వింటూంటే దివ్యానందాన్ని అనుభవిస్తాం మంత్రాలను మరో భాషలోకి అనువదించి స్తోత్రపారాయణం చేయలేం ఆవిధంగా చేసినా కాగితం పూవులాగా చాలా కృత్రిమంగా ఉంటుంది సంస్కృతం గ్రీకు కంటే నిర్దుష్టమైనది, లాటిన్ భాషకంటే విస్తృతమైనది, పర్షియన్ కంటే సొంపైనది.

— జి.ఎమ్ జగ్త్యాని

## కర్మఫలితం తప్పదు

మనం చేసుకున్న కర్మ ఫలితం ఇప్పుడు కాకపోతే ఇక ముందు అనుభవించక తప్పదు. కర్మఫలితం పూర్తిగా తప్పేది కాదు. మనం ఆచరించే సత్కర్మలకు మంచి ఫలితాలు, దుష్కర్మలకు దుష్ఫలితాలు తప్పవు. ఈ పరమ సత్యాన్ని మనసారా గ్రహించి ఎప్పుడూ సత్ఫలితాలను ఆర్జించుకోడానికి ప్రయత్నించు

— ఫూ మింగ్ ఫూ

## అవార్డులు

### ప్రొ. వినాయక్ కృష్ణగోకక్‌కి జ్ఞానపీఠ్ అవార్డు

ప్రఖ్యాత కన్నడ రచయిత మరియు ప్రొ వినాయక్ కృష్ణగోకక్‌కి భారత సాహిత్యాభివృద్ధికి 1990 జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. ఆయన రచించిన 'భారత సింధు రశ్మి' 35,000 పంక్తుల పద్యరచన

"గుణానికి మనకంటే మించినవారితోను, ధనానికి మనకంటే తక్కువవారితోను సరిపోల్చుకోవాలి."

# పాముల వాళ్ళకు ప్రియమైనది

రూపాల్ రావాల్

పాముల వాస్తవాలకంటే పాముల పురాణాలు చాలా ప్రసిద్ధమైనవి మనం తరచు విషకరమైన పాములను గురించి వింటూనే ఉంటాం. భారత దేశంలో సామాన్యంగా కోబ్రా (త్రాచు), క్రెయిట్ (కట్లపాము), రస్సెల్స్ వైపర్, రంపపు పొలుసుల వైపర్ - నాలుగే నాలుగు విషకరమైన పాము జాతులు కనిపిస్తున్నాయి.



Red Sand Boa

విషకరమైన పాముకాట్లు అన్నీ మరణాంతకం కావు. భారతదేశంలో కుక్క కాట్ల వల్ల కలిగే మరణాలలో మూడవవంతు మాత్రమే పాము కాట్ల వల్ల ఏర్పడుతున్నాయి. మన అజ్ఞానం వల్ల, మూఢాచారాల వల్ల నిరపాయకరమైన కొన్ని పాములను చూసీ చూడడంతో చంపేస్తున్నాము

రెడ్ సాండ్ బో అనే పాము నిరపాయకరమైనది ఇది కామన్ సాండ్ బో కంటే ఎంతో సాధువుగా ఉంటుంది దీనిని చేతితో ఎత్తినా కాటు వేయదు. పాము చుట్టుకుపోయి ఆ చుట్టలో తల దూర్చుకుంటుంది. భారత దేశంలో ఉష్ణ ప్రదేశాలలో కనిపించే సాండ్ బో తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ మరియు వాయవ్య ప్రదేశాలలో సర్వసాధారణంగా కనిపిస్తాయి. ఇవి ముఖ్యంగా సులభంగా త్రవ్వకుని లోపల ప్రవేశించడానికి ఇసుకనేలను అభిలషిస్తాయి. ఎలుకల బొరియలలో కూడా నివసిస్తాయి. దీని దిట్టమైన శరీరం బొరియలు చేయడానికి అనువుగా ఉంటుంది.

ఈ బో రంగు ఎరుపు వాగు తేరిన గోధుమ రంగు శరీరం మీద బూడిద వర్ణపు లేక నల్లటి రంగు మచ్చలు ఉంటాయి. చిన్న తవ్వకోలవంటి ముక్కు, మొద్దు తేరిన తోక కలిగిన వీటిని సులభంగా తెలుసుకోవచ్చు. బోపాములు గ్రుడ్లు పెట్టవు. తల్లిపాము పిల్లలు పెరిగి వచ్చేదాకా గ్రుడ్లను శరీరంలో ఉంచు కుంటుంది. ఆరు మొదలు ఎనిమిది సజీవమైన చిన్న పాములు జూన్ మాసంలో పుడతాయి. ఒక్కొక్కటిగా పుట్టే చిన్న పాములు సన్నని ఉల్లిపొర వంటి చర్మంతో చుట్టబడి ఉంటాయి ముక్కుతో ఈ చర్మాన్ని పొడుచుకుని పాము పిల్ల ముందుకు వస్తుంది. చిన్నవాటికి నిర్దిష్టంగా శరీరం పైన చారలు ఉంటాయి. తల్లి పాము వీటిని రక్షించాలనేది లేదు. ప్రతీది దానంతట

## కష్టాల తరువాత సుఖం ఎంతో శోభాయమానం

దీర్ఘకాలం పాటు యాతనలు, కష్టాలు అనుభవించిన తరువాత సుఖం చిమ్మచీకటి తరువాత కాంతివంతమైన జ్యోతిని చూసినట్లు ఎంతో మహిమాన్వితంగా, శోభాయమానంగా ఉంటుంది. కానీ సౌభాగ్యం అనుభవించిన తరువాత కటిక దారిద్ర్యం అనుభవించడం సజీవ మరణం అనిపిస్తుంది

— భానుడు

"చూడగలిగిన నేత్రం, గుర్తించగల హృదయం ఉంటే ప్రకృతి అంతా కళామయం."

అదే తిరగడానికి ప్రారంభిస్తుంది. వాటంతట అవే వేటాడి ఆహారం సంపాదించుకుంటాయి.

రెడ్ సాండ్ బో నే రెండు తలల పాము అని సాధారణంగా అంటారు. విషకరం కాని ఈ పాము తలా తోకా ఒకే రూపంలో ఉండడం వల్ల ఇవి అపాయం కలిగినప్పుడు తప్పించుకుని జీవించగలుగుతున్నాయి. దీనిని బెదరగొట్టినప్పుడు వెంటనే ఇది చుట్టుకుపోతుంది. తలను శరీరపు చుట్టలలో దూర్చుకుంటుంది. తోకతో కొట్టడానికి ప్రారంభిస్తుంది శత్రువులు తోకకు హాని కలిగిస్తారు. ఈ విధంగా బో ప్రాణాలను రక్షించుకుంటుంది. దీని రెండు తలలలో ఆరు నెలలకు ఒక్కొక్కసారి ఒక్కొక్కటి చైతన్య వంతంగా ఉంటుందని విశ్వసింపబడుతుంది. అసలు దీనికి ఒకే తల, ఒకే దిక్కుగా ప్రాకుతుంది. దీని కళ్ళు చాలా చిన్నవి. కనిపించీ కనిపించ కుండా ఉంటాయి. అందుచేత దీనికి కళ్ళు లేవని అనుకుంటారు. దీనికి గల పురాణ గాథలు, చరిత్రలు వల్ల పాముల వాళ్ళు వీటిని ఎక్కువగా అభిలషిస్తారు.

అతి మెల్లిగా ప్రాకే బో అతివేగంగా ఆహారాన్ని వేటాడలేదు. మెడ, తల మాత్రం ఇసుక పైకి కనపడేటట్టు ఉంచుకుని ఆహారపు జంతువు దగ్గరగా వచ్చేదాకా పొంచి ఉంటుంది. బల్లులు, ఎలుకలు, పక్షులు మొదలైన వాటిని అతి నైపుణ్యంగా పట్టుకుంటుంది. సాండ్ బో నొక్కి ఊపిరి సలుపకుండా చేసి పైథాన్ (కొండ చిలువలు) లాగా ప్రాణిని చంపుతుంది. క్రమ క్రమంగా చుట్టదగ్గర చేసి బాగా నొక్కేస్తుంది.

బోలు ఎలుకలను నిర్మూలిస్తాయి. ఎలుకలు, కీటకాలు, చుంచులు, పక్షులు, చిన్న చిన్న నత్తలు, ఇతర పాములు మొదలైనవి రెడ్ సాండ్ బో ఆహారాలు.

-'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## మతతత్త్వ వాదానికి ప్రోత్సాహం లేదు




*ఏ మతానికి చెందినా మనం అందరం సమాన హక్కులు, సమాన అధికారాలు, సమాన బాధ్యతలు గల భారతదేశపు పౌరులం. సంకుచితాభిప్రాయాల తోనూ, సంకుచిత ఉద్యమాలతోనూ ఏ దేశం కూడా అభివృద్ధి పొందదు కాబట్టి మనం మతతత్త్వ వాదాన్ని (communalism) గాని, సంకుచిత స్వభావాన్ని గానీ ఎన్నడూ ప్రోత్సహించలేము.*

— జవహర్‌లాల్ నెహ్రూ

## స్త్రీలకంటే పురుషులకే క్లబ్‌ఫుట్ అధికం

*పుట్టుకతో వచ్చే అంగవైకల్యాలలో స్థూలపాదం (Club-foot) ఒకటి. వీరికి పాదాలు అసహజంగా లావుగా ఉంటాయి ఇది సాధారణంగా స్త్రీలకంటే పురుషులకే అధికంగా సంభవిస్తుంది. క్లబ్ ఫుట్ వైకల్యాన్ని కాస్ట్స్ (Casts), బ్రేసెస్ (Braces) ఉపయోగించి గాని, శస్త్ర చికిత్స చేసి గాని సరి చేయవచ్చు*

— 'హెల్త్'

"భావుకుడు జీవితంలో ప్రతీ విషయాన్ని కళాన్వితం చేసుకోగలుగుతాడు."

# కీటకాల నిదర్శనాలు

## కీటకాలు కనిపించాయి

మొట్టమొదట కీటకాలు 400 మిలియను సంవత్సరాలకు పూర్వం కనిపించాయి.

## 30,000 రకాల బీటిల్స్

పేడపురుగుల వంటి బీటిల్స్ తెలిసిన రకాలు 30,000 పైబడి ఉన్నాయి.



## 60,00,000 రకాల కీటకాలు

మొత్తం 60,00,000 రకాల కీటకాలలో ఒక మిలియను మాత్రమే గుర్తించబడి పేర్లు పెట్టబడ్డాయి.

## అట్లాస్ మాత్ రెక్కల నిడివి 30 సెం.మీ.లు

చిమ్మట పురుగు వంటి అట్లాస్ మాత్ రెక్కల నిడివి సుమారు 30 సెం.మీ.లు అనేక పక్షిజాతుల రెక్కల కంటే ఎక్కువ నిడివి.

## ప్రపంచంలో మొత్తం కీటకాల భారం

ప్రపంచంలో మొత్తం కీటకాలభారం ప్రపంచ జనాభా భారానికి సుమారు 12 రెట్లు ఉంటుంది.

## ఎక్కువ విషకరమైన కీటకం

ఆఫ్రికాదేశ ఉష్ణమండల ప్రదేశాలలో మిలియను చదరపు మైళ్ళ వైశాల్యం గుమిగూ ట్సీ-ట్సీ (tse-tse) ఈగలు ప్రపంచం మిక్కిలి విషకరమైనవి. ఇవి కుడితే మానవులక పశువులకు, ఇతర జంతువులకు ప్రమాదకరమై అతినిద్ర వ్యాధి పట్టుకుంటుంది.

## ఏకైక ఎడారిమిడుతల దండు

ఏకైక ఎడారి మిడుతలదండు 1000 మి యను పైగా ఉంటుంది, ఇది 50,000 మొద 1,00,000 టన్నుల భారం ఉంటుంది.

## కీటకాలు జీవించి ఉండగలవు

కొన్ని రకాల కీటకాలు అతి తక్కువ 30 నుంచి, అత్యధికం 120°F వరకు ఉష్ణోగ్ర లలో జీవించి ఉండగలవు.

## ప్రపంచంలో గోలియత్ బీటిల్ బలిష్టమైనది

తేనెటీగ దాని భారానికి సుమారు 24 రె అధికభారాన్ని ఎత్తగలదు. 300 రెట్లు అ భారాన్ని చక్రాల మీద లాగగలదు. స్కారబ్ (బీటిల్) దాని భారానికి సుమారు 850 రె అధిక భారాన్ని ఎత్తగలదు. ప్రపంచం మిక్కిలి అధిక బలిష్ఠమైన 10 సెం.మీ. పొడవుగా ఉండే పశ్చిమ ఆఫ్రికా గోలియ బీటిల్ దాని భారానికి సుమారు 900 రె అధికభారాన్ని ఎత్తుతుంది.

"శక్తివంతమైన సాధనాన్ని సవ్యంగా వినియోగించుకో గలిగినప్పుడే సమాజం కల్యాణకారకమవుతుంది."

# మొదటి అణుబాంబు విస్ఫోటనం

ఫ్రాంక్ బార్నబి

ప్రొద్దున్న సరిగ్గా 8 15 కి అణుబాంబు ఏవబడింది. తరువాత 43 సెకండ్లకు పెద్ద ంతితో భయోత్పాదక తరంగంతో విమానం రిగింది. బ్రహ్మాండమైన పరమాణుమేఘం ద్దున్న 9 గంటలకు మేఘదర్శనం అయింది 12,000 మీటర్ల పైగా ఎత్తున


Atom Bombs

1945 ఆగస్టు 6 న హిరోషిమాను విధ్వంసం సిన 'లిటిల్ బాయ్' అని చెప్పబడే అణు ంబును విడిచిన B-29 'ఎనోలా గే' ఫ్లైట్ ంలోని మాటలు ఇవి

హిరోషిమా కేంద్ర భాగంలో 580 మీటర్ల న విస్ఫోటించిన అణుబాంబుకి సుమారు ,500 టన్నుల TNT శక్తి ఉన్నట్టు ఊహించ శింది. ఇది 3 మీటర్ల పొడవు, 71 సెం మీ.ల కల్పు, 4 టన్నుల భారం గల ఒక పెద్ద నం ఈనాటి పరమాణు యుద్ధ సాధనాలు లా చిన్నవి సుమారు 8 అంగుళాల పరమాణు యుద్ధ బాంబు మొదట ఉపయోగించిన అణు బాంబు అంత శక్తి కలిగి ఉంటుంది

1945 ఆగస్టు 9 న ప్రొద్దున్న 11 02 గంటలకు నాగసాకి పైన 500 మీటర్ల ఎత్తున ప్రేలిన అణుబాంబు 'ఫాట్‌మాన్' సుమారు 22,000 టన్నుల TNT శక్తిని ఉత్పాదించినట్టు ఊహించబడుతూంది. ఇది 3 25 మీటర్ల పొడవు, 1 5 మీటర్ల వెడల్పు మరియు 4 5 టన్నుల భారం కలిగి ఉంది

అణుబాంబు విస్ఫోటనం చెందినప్పుడు హిరోషిమాలో 3,50,000 మంది జనం ఉన్నారు 1945 సంవత్సరాంతానికి సుమారు 1,40,000 మంది మరణించారని అంచనా వేసారు వీరిలో 20,000 మంది సైనిక దళానికి చెందిన సర్వీస్ మెన్‌లు నాగసాకిలో అణుబాంబు


Atomic Explosion

విస్ఫోటనం చెందినప్పుడు 2,80,000 మంది జనం ఉన్నారు. అంచనా ప్రకారం 1945 సంవత్సరాంతానికి 74,000 మంది మరణించారు.

"లెక్కలేని జీవితచరిత్రల సారాంశమే చరిత్ర" — థామస్ కార్లైల్

ఈ విస్ఫోటనాలకు హిరోషిమాలో 13 చ.కి. మీలు, నాగసాకిలో 67 చ.కి.మీలు ప్రదేశం పూర్తిగా మంటలపాలై బూడిదగా మారిపోయింది.


Hiroshima

అణుబాంబుల వల్ల ఉత్పాదింపబడిన మొత్తం శక్తిలో ఉష్ణం సుమారు మూడవ వంతు. విస్ఫోటనాల వల్ల జనించిన నిప్పుబంతులు (Fire Balls) వెనువెంటనే అనేక మిలియను డిగ్రీల సెల్షియస్ ఉష్ణోగ్రతను అందుకున్నాయి.

హిరోషిమా మరియు నాగసాకీలలో అగ్ని తుఫానులు (Fire - storms) చెలరేగాయి. హిరోషిమాలో చెలరేగినది అతి తీవ్రమైనది. బాంబు ప్రేలిన కేంద్రం నుంచి రెండు కిలో మీటర్ల వృత్త ప్రదేశంలో ఆరుగంటల సేపు


Hiroshima after bombing

పెద్ద పెద్ద మంటలు బయలుదేరి అంటుకుని మండిపోయే పదార్థాలన్నీ పూర్తిగా మండి భస్మీపటలం అయిపోయాయి.

బూడిద కణజాలం చుట్టు ప్రక్కల లేచి తీవ్రమైన ఉష్ణపు మంటలు చల్లని గాలి తగిలి తేమ ఏర్పడింది. దీని ఫలితం రెండు నగరాల మీద విపరీతమైన వర్ష


Nagasaki after bombing

కురిసింది. ఇది ఒక సాధారణమైన వర్ష కాదు రేడియో ధార్మిక (Radio Active సంబంధమైన చిక్కటి తైలం వంటి ద్ర రూపపు వర్షం నేటికీ 'బ్లాక్ రెయిన్' (Blac Rain) అంటారు దీనిని

(మిగతా 42 వ పేజీలో)

## ప్రపంచంలో అత్యుత్తమమైన మొక్కల సేకరణ

*ఇండోనేషియాలో ప్రఖ్యాతి చెందిన బొటానిక గార్డెన్ 1817లో స్థాపింపబడింది. దీంట్లో ప్రపంచం అత్యుత్తమమైన మొక్కలు 1500 వివిధరకా ఉన్నాయి. ఎన్నో అపూర్వమైన మొక్కలు ఇక్క ఉన్నాయి. 50 సంవత్సరాలకు ఒకసారి పూతపె కొబ్బరిజాతి మొక్కలు, ప్రపంచంలో మిక్కిలి పె పువ్వు - పదిసంవత్సరాలకు ఒకసారి పూచే 'అమో ఫోపాలస్' ఇక్కడ ఉంది ఓషధి జాతులలో ఒకటిన్న మిలియను మొక్కల వ్రేళ్ళు పరిశోధనలకు ఎం బెట్టి చిన్న చిన్న పుస్తకాలలో ప్రెస్ చేయబడ్డాయి ఈ తోట లైబ్రరీలో 1,20,000 పైబడి విజ్ఞానశాస్త్రం అనేక వాల్యూములు ఉన్నాయి తోటలో రోడ్లచుట్టు అద్భుతమైన చెట్లు, మొక్కలు ఉంటాయి.*

"దాచినా దాగనివి మూడు : ప్రేమ, గర్భం, ఒంటెమీద ప్రయాణం."
— అరబ్బీ సామెత

# రాజమండ్రి - తెలుగు కవులు

సీతా రవిచంద్రన్

ఆంధ్రప్రదేశ్ తూర్పు గోదావరి జిల్లాలో ఖండ గోదావరి నదీ తీరాన గల నేటి రాజ మండ్రి రాజరాజ నరేంద్రుని ఏలుబడిలో ప్రాముఖ్యమై చారిత్రక ప్రసిద్ధిని సంతరించు కుంది. దీనినే రాజమహేంద్రవరం అని కూడా అంటారు. వేంగీ దేశాన్ని పాలించిన రాజులకు మహేంద్రుడు అనే బిరుదు ఉండడం వల్ల ఆ


వీరేశలింగం పంతులు

ధాని నగరానికి రాజమహేంద్రవరం అని ు కలిగినట్లు చరిత్ర. బ్రిటిష్ పాలనా పర్కం వల్ల ఆ రాజమహేంద్రవరమే రాజ ంద్రిగా మారింది. ఇది చాళుక్యులు, రెడ్డి జులు, గజపతులు, విజయనగర రాజులు, ల్తానులు ఏలుబడులలో సౌభాగ్యవంతంగా ల్లింది. ఈనాడు ఇక్కడ మనం చూసే య్యే మెట్ట, కందకం రోడ్డు, కోట గుమ్మం, ంగధర మెట్ట మొదలైనవన్నీ చారిత్రక రకాలు. ఆనాటి సౌరంగాలు, ఎత్తయిన కారాలు, భవనాలు చరిత్ర గర్భంలో కలసి పోయాయి ఇచ్చట లభించిన త్రవ్వకాలలో అనేక ప్రాచీన ఆలయ శిథిలాలు, వెండి నాణాలు, పూజాద్రవ్యాలు కొన్ని మద్రాసు మ్యూజియంలో భద్రపరిచారు. మరికొన్ని స్థానికంగా నెలకొన్న ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలిలో జాగ్రత్త పెట్టారు ఇక్కడి మార్కండేయ ఆలయం, శ్రీవేణు గోపాలస్వామి ఆలయం ముఖ్యమైన దేవాలయాలు. గోదావరి నదికి అవతల గట్టున కొవ్వూరు, ఇవతల గట్టున రాజమండ్రిని కలిపే గోదావరి నది మీది బ్రిడ్జి సుమారు రెండు మైళ్ళ నిడివి ఉంటుంది. ఇదిగాక క్రొత్తగా ఇటీవల ఒక బ్రహ్మాండమైన రోడ్డు కమ్ రైల్వే బ్రిడ్జి కూడా నిర్మించబడింది గోదావరి కోటి లింగాల రేవు ఎంతో పవిత్రమైనది. ఇక్కడ 12 సంవత్సరాలకు ఒకసారి పుష్కర మహోత్సవం జరుగుతూంటుంది. ఈ మహోత్సవ సందర్భంగా అనేక మంది యాత్రికులు గోదావరి స్నానాలకు వస్తారు 1991లో గోదావరికి పుష్కరాలు జరిగాయి దామెర్ల రామారావు ఆర్టు గాలరీలో ప్రత్యేక చిత్రాలు ఆంధ్ర చిత్రకళను ప్రదర్శిస్తాయి. ఇక్కడ ప్రభుత్వం వారి యాజమాన్యంలో ఒక పేపరు మిల్లు నడుపబడుతూంది. అనేక ప్రభుత్వ కళాశాలలు, విద్యా సంస్థలు నెలకొన బడ్డాయి శ్రీ వీరేశలింగం పంతులు గారి సంఘ సంస్కరణ ఇక్కడ నుంచే ప్రారంభమైంది.

వేంగి దేశాన్ని పాలించిన చాళుక్య రాజు రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకున్నాడు. ఈతడి ఆస్థానాన్ని అలంకరించిన అశేషశేముషీ ధురంధరుడు, సకల విద్యా విశారదుడు, ఆంధ్ర వాగనుశాసనుడు, ఆంధ్ర కవితాగురుడు, ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుడు, అనంత ప్రతిభాశాలి అగు నన్నయ్య

"పుస్తకాలు రెండు రకాలు ప్రస్తుతానికి ఉపయోగ పడేవి,
కలకాలం ఉపయోగపడేవి." — రస్కిన్

భట్టారకుడు వైదిక మతోద్ధారకుడై ఆంధ్ర వాఙ్మయపు ఆదికవిగా విఖ్యాతి నొంది మహా భారతం ఆంధ్రీకరణను తొలి తెలుగు కావ్యంగా 11వ శతాబ్దంలో ప్రారంభించాడు. ఆంధ్ర భాషకు అనువైన రీతిలో తెలుగు కవిత్వాన్ని కావ్యరూపంలో ఆంధ్రులకు అనుగ్రహించి చిరస్మ రణీయుడైనాడు. 13వ శతాబ్దంలో తిక్కన, 14వ శతాబ్దంలో ఎఱ్ఱాప్రగడ నన్నయ్య ప్రారంభించిన మహాభారతాన్ని పూర్తిచేసారు. నాటి నుండి నేటిదాకా రాజమండ్రి ఒకేరీతిగా అనేక మంది సారస్వతాభిమానులకు, కవులకు ఆటపట్టు అయింది. కందుకూరి, కొక్కొండ, వావిలాల, చిలకమర్తి, వడ్డాది, తాడూరి, కల్లూరి, ఆకొండి, పానుగంటి, శ్రీపాద, చిలుకూరి, జనమంచి, భమిడిపాటి, క్రొవ్విడి మొదలైన వారెందరో కవివరేణ్యులు, సాహిత్యాభిలాషులు అందరూ ఇక్కడివారే.

19వ శతాబ్దం నుంచీ పాశ్చాత్య భాషా ప్రభావం వల్ల ప్రాచీన సాహిత్య ప్రక్రియతో పాటు సాహిత్యంలో వీరు నవ్యనూతన ప్రక్రియ లను ఎన్నిటినో అవతరింపజేశారు. నవలలు, కథలు, కథానికలు, ప్రహసనాలు, స్వీయచరిత్రలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, విమర్శలు మొద లైనవి ఉద్భవించాయి. ముద్రణ ప్రచురణ వీటికి దోహదం కలిగించింది. సాహిత్యం ప్రజాశ్రితమై జనసామాన్య వేద్యమైంది.

పందొమ్మిదవ శతాబ్దం మధ్య భాగం నుంచి తెలుగు వాఙ్మయంలో క్రొత్తయుగం ప్రారంభ మైంది. ఈ నవయుగానికి నాంది పలికిన కందుకూరి వీరేశలింగం పంతులు గారి పాత్ర గణనీయమైనది వీరు తెలుగు వాఙ్మయంలో అనేక క్రొత్త పుంతలు వేసి ఆధునిక ఆంధ్ర వాఙ్మయ వికాసానికి మార్గ-దర్శకులని అనిపించు కున్నారు. గద్య బ్రహ్మగా ప్రఖ్యాతి పొందారు. స్వీయ చరిత్రకు, నవలకు, ప్రహసనానికి, గద్యకి వీరు ఆదర్శకవి సంఘ సంస్కరణ ప్రియులు స్త్రీ పునర్వివాహోద్యమానికి పుష్టి కావించారు. వీరు మాలతీ మధుకరము, అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము, హరిశ్చంద్ర నాటకము, రత్నావళి, ప్రబోధ చంద్రోదయం, సత్యరాజా పూర్వదేశ యాత్రలు, రాజశేఖర చరిత్ర, నీతి చంద్రిక, ఆంధ్ర కవుల చరిత్రము, స్వీయ చరిత్రము, ప్రహసనాలు మొదలైనవి అనేకం రచించారు. సంఘ సంస్కార ప్రచారార్థం వీరి రచనలు తేలిక శైలిలో ప్రజా సామాన్యానికి అర్థమయేటట్లు ఉంటాయి. వీరి సత్యరాజా పూర్వదేశ యాత్రలు తెలుగు నవలలకు మార్గదర్శకము.

కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు 'మహా మహోపాధ్యాయ' బిరుదమును పొందిన తెలుగు వారిలో మొదటివారు గొప్ప సంస్కృతాంధ్ర పండితులు. వీరు ద్వైతమతా నుయాయులైనా శాస్త్రీయ పద్ధతిలో శంకరాద్వైతాన్ని స్వీక రించారు బిల్వేశ్వరీయము (మహా కావ్యం - తిరువేల్లం క్షేత్ర మహాత్మ్యం - తమిళ మాతృక), ధనంజయ వ్యాయోగము, నరకాసుర విజయ వ్యాయోగము, మంగళగిరి మహాత్మ్యము, కోరు కొండ మహాత్మ్యము, గోవిందమంజరి, గోదావరి వర్ణనము, దీక్షిత చరిత్రము, బిల్వేశ్వరశతకము మొదలైనవి రచించారు. రాజమండ్రి గవర్నమెంట్ కాలేజీలో ప్రధాన తెలుగు పండితులుగా 30 సంవత్సరాలు ఉద్యోగం చేసారు. వారికి కవి బ్రహ్మ అక్షర సంఖ్యాచార్యులు, ఆంధ్ర జాన్సన్ అనే బిరుదులు ఉన్నాయి. 'ఆంధ్ర భాషా సంజీవిని' అనే వీరి పత్రిక తెలుగు పత్రికలలో మొట్టమొదటిది వీరు అనేక క్రొత్త వృత్తాలను కల్పించారు. గ్రాంధిక భాషాభిలాషి. ఇంట్లో భార్య దగ్గర, బజారులో దుకాణాల దగ్గర, ఇంటి గుమ్మంలో బిక్షుకుల వద్ద గ్రాంధికంలో మాట్లాడే ఛాందసుడు. వీరు జయదేవుని గీత

గోవిందాస్ని గీతామహానటముగా తెలుగులోకి అనువదించారు

వావిలాల వాసుదేవ శాస్త్రిగారు పేరుగన్న రచయిత. అనేక ఇంగ్లీషు నాటకాలను తెనిగించడమే గాకుండా స్వతంత్రంగా అనేక నాటకాలను వ్రాశారు వీరి 'నందక రాజ్యము' స్వతంత్ర ఆంధ్ర నాటకాలలో మొదటిది ఆరోగ్య సర్వస్వము, గరుడాచలము, మృచ్ఛ కటకం, ముముక్షు తారకము, మాతృ స్వరూప స్మృతి మొదలైన గ్రంధాలను రచించారు వీరికి రాజమంత్రి కాలేజీలో బి ఎ పరీక్ష పాసైనప్పుడు మాక్డొనాల్డ్ బంగారు పతకం లభించింది వీరు ఈ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేసారు

చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు అనేక నాటకాలను రచించి పేరు పొందారు. వీరి రచనలలో మృదు మధురమైన హాస్యధోరణి కనిపిస్తూంటుంది రామచంద్ర విజయం, చింతామణి, అహల్యాబాయి, కర్పూర మంజరి, సౌందర్య తిలక మొదలగు అనేక నవలలను రచించారు. కందుకూరు వారు నిర్వహించిన నవలల పోటీలో ప్రథమ బహుమానాలను పొందారు వీరు నాటక రచనలో ఎంత గొప్ప వారో, నవలా రచనలో అంతకంటే గొప్పవారు వీరు రచించిన మొదటి నవల రామచంద్ర విజయంలో ఆంధ్రప్రదేశ మండలి కోనసీమ ప్రాంతాన్ని విశదంగా వర్ణించారు. ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు వీరికి 'కళా ప్రపూర్ణ' బిరుదము నిచ్చి గౌరవించారు వీరేశలింగం పంతులు గారి తరువాత స్వీయచరిత్రను వ్రాసుకున్న వారు వీరే. నాటకాలలో పద్యాలను చేర్చారు. వారి గయోపాఖ్యానం ప్రఖ్యాతి చెందిన నాటకం. చిలకమర్తి వారి హాస్యం జనరంజకంగా ఉంటుంది వీరి గణపతి దీనికి ఉదాహరణ. ఈ గణపతి అనాటి బ్రాహ్మణ్యం యొక్క దుస్థితికి ప్రతినిధి

వడ్డాది సుబ్బారాయుడు గారు వసు. రాయ కవిగా ప్రసిద్ధి పొందారు. గొప్ప సంస్కృతాంధ్ర పండితులు రాజమండ్రి గవర్నమెంట్ కాలేజీలో ప్రథాన తెలుగు పండితులుగా చాలాకాలం గడిపారు. భగవత్కీర్తనలు, భక్త చింతామణి, సుతస్మృతి, శాకుంతలము, మల్లికామారుతము, విక్రమోర్వసీయము, ఆర్త రక్షామణి, మేఘ సందేశం, వసురాయ చాటూక్తి, ముక్తావళి మొదలైనవి రచించారు. వీరు నాటకాలలో పాత్రలు కూడా ధరించేవారు అధునిక ఆంధ్ర కవిత్రయమని పేరు పొందిన వారిలో వీరొకరు మిగిలిన ఇద్దరు కందుకూరి, వావిలాల వీరికి "సూక్తి సుధానిధి" అనే బిరుదమునిచి రాజమండ్రి పౌరులు గౌరవించారు




తాడూరి లక్ష్మీ నరసింహారావు గారు చింతలపూడి, భీమవరం, కడప, కొత్తపేట, కదిరి మొదలైన ప్రదేశాలలో డిప్యూటీ తహసీల్దారుగా, ప్రభుత్వోద్యోగులుగా ఉంటూ తెలుగు సాహిత్య సేవ చేసిన వారిలో ఒకరు వీరు రిటైరు అయిన తరువాత 24 సంవత్సరాల పాటు సాహిత్య సేవకు జీవితాన్ని ధారపోసారు. సేవానైచ్యము, అధికార మదాంధత, నిరర్ధక బిరుద ప్రదానము మున్నగు వాటిని నిరసిస్తూ

"నీ బుద్ధిని నీవు ఉపయోగించుకో,
ఇంకొకరు అరువు ఇచ్చేది కాదు." — అరబ్బీ సామెత

'భోజ కుమారం' అనే స్వతంత్ర నాటకాన్ని రచించారు. కవిత్రయం మహాభారతంలో వదలిన భగవద్గీత, ప్రజాగార పర్వము, సనత్సు జాతీయము వీరు తెనిగించారు. భారతం ఉద్యోగపర్వం తెలుగు చేసారు. లక్ష్మీ సంవాదం, చంద్రాలోకము, మేఘ సందేశము, శృంగార తిలకం, రసమంజరి, ఋతు సంహారం, జ్ఞానోదయం (ఇంగ్లీషు పద్యాలకు అనువాదం), నీతి కథానిధి, చమత్కార చంద్రిక, పండితరాయ శతకము, బాలనీతి మొదలగు గ్రంథాలను ఎన్నిటినో రచించారు. వీరి రచనలు ఎక్కువ ఆవేశంతో మృదుమధురంగా ఉంటాయి. వీరి గ్రంథాలు కొన్ని విద్వాన్‌కోర్సులకు, చిన్న క్లాసులకు పాఠ్య పుస్తకాలుగా నిర్ణయింపబడ్డాయి తమ ఆర్జనను పూర్తిగా గ్రంథ ప్రచురణకు వినియోగించిన నిరాడంబర జీవి

కల్లూరి వేంకట రామశాస్త్రి గారు బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక, హాస్య కుముదాకరము (ప్రహసనము), కోటి లింగేశ్వర శతకము మొదలైనవి రచించారు వీరి రచనలలో పాండిత్య ప్రతిభ, కవితా మాధుర్యం ఒకదానికి ఒకటి మించి ఉంటాయి.

అకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు మహాభారత నవనీతము, ప్రబోధ చంద్రోదయం, అనర్ఘ రాఘవము, గంగాలహరి స్తోత్రము, భామినీ విలాసం, సూర్య శతకము మొదలైన గ్రంథాలు అనేకం రచించారు. వీరిని పౌరులు 'సంచాలక విజ్ఞాన సర్వస్వం' అని పిలుస్తుండేవారట. అన్ని శాస్త్రాలలోనూ పరిచయం గలవారు. వీరు హాస్యప్రియులు. మీకు జీతమెంతని అడిగినప్పుడు 'వయసుకు మించలేదు లెండి' అనేవారట. ఉభయ భాషా పండితులు. వీరి కవిత్వం సలక్షణంగా వ్యర్థ పదాలు లేకుండా ఉంటుంది.

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు సుప్రసిద్ధ హాస్యకవి వీరి పేరు వినడంతోటే వీరి 'సాక్షి' జ్ఞాపకం రాకమానదు. వృద్ధ వివాహం, సారంగధర చరిత్ర, రాధాకృష్ణ కల్యాణ రాఘవము, కంఠాభరణము, కోకిల, విప్రనారాయణ చరిత్ర, విచిత్ర మరణము, పూర్ణిమ, హాస్యవల్లరి, జలజ మొదలైన గ్రంథాలు ఎన్నో రచించారు వీరి సాక్షి తెలుగు జాతికి ఒక ఉజ్వల విజ్ఞాన దీపము తెలుగు వచన రచనలో వీరిది క్రొత్తబాట. వీరి రచనలు చదువుతూంటే చదవాలని ఇతోధిక ఉత్సాహం కలుగుతుంది. విసుగు జనించదు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఇంచుమించు 200 గ్రంథాలు రచించారు. బొబ్బిలి యుద్ధ నాటకము, వేణీ సంహారం, కల భాషిణి, రాజభక్తి, భోజరాజ విజయం, శ్రీనాథ కవి రాజీయము, గౌతమ మహాత్మ్యము, శ్రీకృష్ణ కవి రాజీయము, శ్రీకృష్ణ భారతము, శ్రీకృష్ణ రామాయణం, శ్రీకృష్ణ భాగవతము, గణేశ పురాణము, బ్రహ్మానందము మొదలైనవి రచించారు. గౌతమి, మానవసేవ, వందే

## మొట్టమొదటి ఎలక్ట్రానిక్ డిజిటల్ కంప్యూటర్

*1946లో పూర్తికావింపబడిన ఎనియాక్ (ENIAC) అనే మొట్టమొదటి ఎలక్ట్రానిక్ డిజిటల్ కంప్యూటర్‌ని పనిచేయించడానికి అయిదుమంది కావలసి వచ్చింది ఇది 18,000 వాక్యూమ్ గొట్టాలతో 30 టన్నుల భారం ఉంది*

## అమెరికా అధ్యక్షుడు గ్రోవర్ క్లీవ్‌లాండ్

యునైటెడ్ స్టేట్స్ 22వ మరియు 24వ అధ్యక్షుడు గ్రోవర్ క్లీవ్‌లాండ్ ఒక్కడే [illegible] కాల వ్యవధులలో అమెరికా అధ్యక్షపదవిని అధిష్ఠించాడు.

"జీవితం రెండు భాగాలుగా ఉం[illegible] కలవంటిది ఒకటి,
కోరిక వంటి [illegible]"

మాతరం, వజ్రాయుధం అనే పత్రికలను స్థాపించి నడిపించిన కవిరాజు, కవి సార్వభౌముడు, కళాప్రపూర్ణుడు , మహా మహోపాధ్యాయుడు పూర్వం పెద్దనాది కవులకు జరిగిన మహాసన్మానం వీరికి జరిగింది పద్య రచనలో మంచి ధారాళత ఉంటుంది ఆంధ్ర వ్యాసులనే బిరుదు కూడా ఉంది ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం వారు వీరిని ఆస్థానకవిగా నియమించారు.

చిలుకూరి వీరభద్రరావు గారు రాజమహేంద్ర వరం చరిత్ర, ఆంధ్రుల చరిత్ర, జీర్ణ కర్ణాటక రాజ్యము మొదలైన రచనలు చేసిన గొప్ప చారిత్రక పరిశోధకుడు కొన్ని చారిత్రక నవలలను కూడా రచించారు 1928లో నంద్యాలలో వీరికి సర్వేపల్లి రాధాకృష్ణుని యాజమాన్యమున జరిగిన ఆంధ్ర మహాసభలో 'ఆంధ్ర చరిత్ర చతురానన' అనే బిరుదు ఇచ్చి గౌరవించారు.

జనమంచి వేంకట రామయ్యగారు నవ కుసుమాంజలి, మాలతీ మాధవం, సుప్రభాతం, మేఘదూత రచించారు భమిడిపాటి కామేశ్వర రావు గారు హాస్య రచనలలో ప్రత్యేక స్థానం వహిస్తారు బాగు బాగు, ఎప్పుడూ ఇంతే, కచటతపలు, అద్దె కొంపలు మొదలైనవన్నీ అందరికీ పరిచయమైనవే వీరి రచనలు ఎంతవారికైనా నవ్వు పుట్టిస్తాయి పాత్రగత, భాషాగత, శబ్దగతమైన హాస్యాన్ని వీరు ఆవిష్కరించారు వీరి త్యాగరాజు ఆత్మ విచారం చెప్పుకోవలసిన గ్రంథం వీరు హాస్య బ్రహ్మగా ప్రసిద్ధి పొందారు.

క్రొవ్విడి లక్ష్మీ నరసింహారావు సామాన్య జనానీకాన్ని రంజింప జేయడానికి అనేక నవలలను రచించారు. ఆనాటి సామాజిక పరిస్థితులను పరిశీలించి శృంగారం, ప్రేమ మొదలైనవాటిని జోడించి వ్యావహారిక భాషలో జనానీకాన్ని ఆకర్షింపజేశారు వందలాదిగా కాలక్షేప నవలలను రచించారు రైల్వే నావలిస్టుగా పేరు పొందారు ఇంతి, చామంతి, పూబంతి మొగమాటానికి వెడితే మొదలైన వాటిని ఎన్నిటినో రచించారు సామాజిక సమస్యలను విడమరచి చర్చించి నిర్భయంగా అతి త్వర త్వరగా నవలలను తయారుచేసిన ఘనుడు ఈనాటికీ ఈ రాజమండ్రి అనేక సాహిత్యాభిలాషులతో, సాహిత్యసభలతో, సమావేశాలతో, గోష్ఠులతో కళకళలాడుతూ ఉంటుంది

( 37 వ పేజీ తరువాయి)

హిరోషిమాలో ఉన్న 76,000 భవనాలలో సుమారు 68 శాతం మంటల వల్ల, విస్ఫోటనం వల్ల పూర్తిగా ధ్వంసం అయిపోయాయి 24 శాతం బాగా దెబ్బతిన్నాయి నాగసాకీలోని 50,000 ఇళ్ళలో 25 శాతం పూర్తిగా మండిపోయాయి సుమారు 11 శాతం ఎక్కువ దెబ్బతిన్నాయి

ఈ రెండు నగరాలలో విస్ఫోటనం చెందిన తరువాత అనేక సంవత్సరాల పాటు ఏర్పడిన రేడియో ధార్మిక ప్రభావానికి అనేకమంది గురి అయి వివిధ వ్యాధులతో మరణించారు జన్యు సంబంధమైన హాని కలుగుట వల్ల వారి సంతతికి అంగవైకల్యాలు ఏర్పడ్డాయి

అణు యుద్ధాల వల్ల సాంఘిక మరియు మానసిక పరిణామాలను మనం ఊహించలేక పోయినా అతి భయంకరంగాను మరియు సర్వనాశనకరంగానూ ఉంటాయని హిరోషిమా, నాగసాకీల మీది అణుబాంబు ఫలితాలు తెలియజేస్తున్నాయి. ఇక అణు ప్రభావ వలయంలో మానవజాతి ఉంటుందో లేదో ఎవరూ చెప్పలేరు.

"కత్తిచేసే గాయాలకంటే నాలుకచేసే గాయాలు తీవ్రమైనవి."

# చిట్టిదేవతలకు చిన్న కథలు

## ఎవరు గొప్ప?

ఒక అందమైన నగరం. దానిని దేవతలు పాలిస్తుండేవారు. వారు తమ ధర్మాన్ని చక్కగా నిర్వహిస్తూండేవారు. అందుచేత ఆ నగరంలో అందరూ సంతోషంగా ఉండేవారు.

కొంతకాలానికి ఈ దేవతలకు అమితంగా గర్వం ఏర్పడింది. ఎవరికి వారే తామే గొప్ప అని, తమవల్లే నగరంలో సంక్షేమం ఏర్పడిందని, తాము లేకపోతే అంతా ఛిద్రం అయిపోతుందని గర్విస్తూండేవారు



ఈ దేవతల నగరం ఏదోకాదు - మానవ శరీరం. దేవతలు జ్ఞానేంద్రియాలు అవయవాలన్నీ తమ తమ పనులు సక్రమంగా నెరవేర్చేవి అందుచేత శరీరం ఎప్పుడూ ఆరోగ్యంతో సుఖంగా ఉండేది. అవయవాలలో అహంకారం ఆవిర్భవించినప్పుడు ప్రతీది తనకు తానే గొప్ప అని మిట్టి పడుతూండేది. ప్రతీది తాను లోపిస్తే శరీరంలో అన్ని పనులు ఆగిపోతాయని, అప్పుడు శరీరం క్షీణించిపోతుందని అనుకుంది అందుచేత వారిలో తగాదా బయలుదేరింది

మొట్టమొదట ఎక్కడలేని అహంకారంతో మనస్సు ప్రారంభించింది. 'నేను మీ అందరికి రాజును మీరంతా నా అధీనంలో ఉన్నారు నేను నా ఇష్టం వచ్చినట్టు మిమ్ములను నడిపిస్తున్నాను నేను లేకపోతే మీలో ఏ ఒక్కరు ఏమీ చేయలేరు ఎవ్వరూ మిమ్మల్ని గొప్ప అని అనుకోరు' అంది

మనస్సు చెప్పిన దానికి కోపంతో ఉద్రేకించి పోయి కన్ను 'నేనే ఈ శరీరంలో ముఖ్యమైన దానిని నేను లేకుండా కాళ్ళు చేతులు తమ తమ పనులు సక్రమంగా నెరవేర్చలేవు. నేను లేకపోతే చదువు ఉండదు, వ్రాతలు ఉండవు' అంది

వెంటనే ప్రగల్భంతో చెవి ప్రారంభించింది 'నీవు గొప్ప అంటే ఎవరు ఒప్పుకుంటారు నేను లేకపోతే - ఏమీ వినపడదు. ఏదీ వినిపించకుండా ఎవరు ఏంచేయగలరు? నేనే అందరి కంటే గొప్పదానిని' అంది.

ముక్కు లేచింది 'ఏమిటి అందరూ వదరుతున్నారు? నేను లేకపోతే అసలు వాసనే తెలియదు. శ్వాస అసలు నావల్లే జరుగుతూంది. శ్వాసించకుండా ఎవరు జీవించగలరు? నేను మీ అందరికంటే గొప్పదానిని' అంది.

అంతవరకూ మాట్లాడకుండా నోటిలో

"విశ్వాసంతో కొంతైనా చేయవచ్చు, లేకపోతే ఏమీ చేయలేవు."

ఊరుకున్న నాలుక తన గొప్ప చెప్పుకోవడం ప్రారంభించింది చాలా ఆశ్చర్యంగా ఉంది. పోటీతో జగడానికి బయలుదేరితే నేను ఊరికే ఉండగలనా అంటూ అమితమైన అహంకారంతో నాలుక ప్రారంభించింది. 'ఛీ మూఢులారా! ఇంతమాత్రం తెలియదా? నేను లేకపోతే మీ ప్రగల్భాలు మీరు ఇలా చెప్పుకోగలరా? మీకు తెలియదు. గొప్ప గొప్ప అధినాయకులు అనుకునే వాళ్ళందరికీ ఒక అమోఘమైన శక్తి ఉంది - మాట్లాడడం నేను లోపిస్తే మీరందరూ నిర్వీర్యులైపోతారు నేను లేకపోతే తినే ఆహారంలో ఉప్పు పులుపు తీపి రుచుల వైవిధ్యం తెలియదు. అన్నీ ఒకే విధంగా ఉంటాయి రుచి తెలియక పోయినప్పుడు జీవితం విలువ ఏముంది? నేనే అందరికంటే గొప్పదానిని'

ఇంతసేపూ నిశ్చింతగా ఉన్న ఆత్మ తగవులాటలు విని 'నా గురించి నేనేమీ గొప్ప చెప్పుకోవడం లేదు నేనే మీ అందరికంటే గొప్పదానిని' అని చెప్పి ఊరుకుంది

దీనికి అవయవాలన్నీ నవ్వుతూ "ఛీ మూర్ఖా! నేను గొప్పలు కొట్టుకోవడం లేదు, నేనే మీ అందరి కంటే గొప్ప అని ఎలా చెప్పుకోగలవు!" అన్నాయి.

గంభీరంగా ఆత్మ జవాబు చెప్పింది. "మనలో ప్రతీవారు ఎవరికి వారే గొప్ప అని, ఇతరులందరూ ఎందుకూ పనికిరాని వారని అనుకుంటున్నాం ఈ తగవు తీరేది కాదు కాబట్టి ఒక పోటీ పెట్టి ఎవరు గొప్పో నిర్ణయించుకుందాం. మనం ఒక సంవత్సరం పాటు ఒకరి తరువాత ఒకరు ఈ శరీరాన్ని విడిచి వెళ్ళిపోదాం. అప్పుడు ఎవరు లేకపోతే దేహంలో అన్ని పనులు, క్రియలు నిలిచి పోతాయో వారే గొప్పవారుగా పరిగణించబడతారు. ఈ తీర్పుకి అన్నీ ఒప్పుకున్నాయి. మొట్ట మొదట మనస్సు ఒక సంవత్సరం పాటు విడిచి వెళ్ళిపోయింది తరువాత వచ్చి చూస్తే ఏ అంగానికా అంగం తమ తమ పనులు చేసుకుంటున్నాయి యథాక్రమంగా ఎప్పుడూ ఉన్నట్లే కార్యక్రమాలు యథావిధిగా కొనసాగిపోతున్నాయి మనస్సు ఆశ్చర్యం వెలిబుచ్చినప్పుడు అంగాలన్నీ చేరి 'ఎందుకు అలా ఆశ్చర్యపడిపోతావు, నీవు లేకపోయినా మేమంతా సుఖంగా ఉన్నాం మేమేమీ నిరుత్సాహ పడిపోలేదు. మాకు ఏ విచారం లేదు. మేమంతా చిన్నపిల్లలు లాగా హాయిగా ఉన్నాం. దీనికి మనస్సు ఏమీ మాట్లాడకుండా యథాస్థానంలోకి వెళ్ళి కూర్చుంది

తరువాత కన్ను బయలుదేరింది. అది కూడా తిరిగివచ్చి వివిధాంగాలు తమ పనులు యథావిధిగా నిర్వహిస్తూన్నట్టు గ్రహించింది. కళ్ళు లేని కపోతి కూడా నూరు ఏళ్ళు జీవించ గలదు. కంటి తరువాత చెవి బయలుదేరింది దారిలో ఒక బధిరుడు ఎదురైయాడు. అతడు సంకేతాలతో అన్ని విషయాలు చెప్పాడు శరీరం అంతా ఇతర అంగాలతో చైతన్యవంతంగా ఉంది తన గడువు పూర్తి కాకుండానే చెవి తిరిగి వచ్చింది. తరువాత ముక్కు బయలు దేరి వెళ్ళింది. ముక్కుకి దారిలో ఒక ముక్కిడి తటస్థ పడ్డాడు. వెంటనే ముక్కు తిరిగి వచ్చేసింది.

## ప్రపంచంలో సగంమంది పిల్లలే పోలియో నిరోధకం చేయబడ్డారు

*ప్రపంచంలో సగంమంది పిల్లలే పోలియో నిరోధకం చేయబడ్డారు (వెన్నెముకలో బూడిద రంగు పదార్థం వాచిపోవడం) అభివృద్ధి పొందుతూన్న దేశాలలో ప్రతీ సంవత్సరం 2,75,000 మంది పిల్లలు ఈ వ్యాధితో బాధపడుతున్నారు*

*— 'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో*

"పరీక్షించి చూడకుండా త్రాగవద్దు, పరిశీలించి చదవకుండా సంతకం చేయవద్దు."

తరువాత నాలుక లేచి వెళ్లడానికి ప్రారంభించింది. ఒక మూగవాడిని చూసీ చూడడంతోటే ఏమీమాట్లాడకుండా తిరిగి వచ్చేసింది.

అన్ని అవయవాలు వచ్చాక ఆత్మ తన ఉపన్యాసం ప్రారంభించింది. 'ఇప్పుడైనా తెలిసిందా? మనందరిలో నన్నే గొప్ప అంటారా? ప్రతీ అవయవానికి అహంకారం అణిగిపోయినా అహంభావంతో 'నీవు ఎలా గొప్ప అనుకుంటావు? నీవు లేకుండా కూడా మేమందరం మాపనులు మేం చేసుకుంటాం' అన్నాయి. వెంటనే ఆత్మ దేహాన్ని వదలి వెళ్ళిపోవాలని నిశ్చయించుకుని బయలుదేరింది. ఇంకా పూర్తిగా విడిచి వెళ్ళలేదు. చేతులు, కాళ్ళు చల్లబడిపోవడానికి ప్రారంభించాయి. నాలుక మాటపడిపోయింది. కళ్ళు స్తంభించి పోయాయి. కంట్లో గుడ్డు తిరగడం లేదు. శరీరం అంతా మొద్దుబారి పోతూంది ఈ అవస్థ చూచి ఆత్మ శరీరంలో ఉండడానికి నిశ్చయించుకుంది. వెంటనే ప్రతీ అవయవం పనిచేయడానికి ప్రారంభించింది. 'క్షమించు ఓ ఆత్మా! నీవు మాత్రం విడిచి వెళ్ళవద్దు. నీవే చాలా గొప్ప' అని వివిధాంగాలు ప్రార్థించడం ప్రారంభించాయి అప్పుడు ఆత్మ 'జాగ్రత్తగా వినండి. ఈనగరాన్ని పాలించడానికి మనం అందరం ఏకమై ఉండాలి. మనలో ఏ ఒక్కరు లేకపోయినా శరీరం బాధపడుతుంది. మనం అందరం పొందికగా పనిచేసినప్పుడే శరీరం ఆరోగ్యవంతంగా, సుఖంగా ఉంటుంది. రండి, మనం అందరం చేదోడువాదోడుగా సంఘీభావంతో కలిసి మన పనులు చేసుకుందాం.'

శరీరంలో వివిధ అంగాలు లాగే ఒక కుటుంబంలో, సమాజంలో, దేశంలో వివిధ వ్యక్తుల సుఖసంతోషాలు, శాంతి- భద్రతలు ఐకమత్యం మీదే ఆధారపడి ఉంటాయి

## ఉత్తరధృవాన్ని జయించిన మొట్టమొదటి వీరుడు పియరీ



ROBERT PEARY

*అమెరికన్ నౌకాధికారి మరియు అన్వేషకుడు అగు రాబర్ట్ ఎడ్విన్ పియరీ 1898 వ సంవత్సరం నుంచీ నీటిలో మునిగి ఉన్న ఉత్తరధృవాన్ని జయించడానికి అనేక ప్రయత్నాలు సలిపాడు. చివరకు 1909 ఏప్రిల్‌లో ఉత్తరధృవాన్ని జయించిన మొట్టమొదటి వీరుడు అయాడు ఇంగ్లీష్ అన్వేషకుడు రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ కంటే 35 రోజులు ముందుగా నార్వేకు చెందిన రోనాల్డ్ అముండ్‌సెన్ 1911లో దక్షిణధృవాన్ని మొట్టమొదట చేరాడు. స్కాట్ జనవరి 1912 లో దక్షిణ ధృవాన్ని చేరాడు.*

## 15 - 49 సంవత్సరాల మధ్య ప్రతీ ఆరవ స్త్రీ గర్భవతే

ఏసమయంలోనైనాసరే 15-49 సంవత్సరాల మధ్య ప్రతీ ఆరవస్త్రీ అభివృద్ధి చెందుతున్న దేశాలలో గర్భవతి అయితే, అభివృద్ధి చెందిన దేశాలలో 17 మందిలో ఒక్కర్తే గర్భవతిగా ఉంటుంది.

— వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ రిపోర్ట్ సౌజన్యంతో

# ఒలింపిక్స్ - కొన్ని అద్భుత సాహసాలు

చెకోస్లోవేకియా హెల్‌సింకీలో 1952లో నిర్వహించబడిన ఒలింపిక్ క్రీడలలో ఎమిల్ జాటోపెక్ 5,000 మీటర్లు, 10,000 మీటర్లు మరియు మరాథాన్‌లలో వరుసగా మూడు బంగారు పతకాలను పొందాడు. ఇందులో వింత విషయం పరుగుల పందెం మరాథాన్‌లో అంతకు ముందు ఈ 'రన్నింగ్ మెషీన్' ఎన్నడూ పాల్గొనలేదు ఇతడు హెల్‌సింకీలో బంగారు పతకాన్ని జయించడమే కాదు - మరాథాన్‌లో క్రొత్త రికార్డును స్థాపించాడు.



ఇతడి భార్య డాడ్జి కూడా జావెలిన్‌ను 165 అడుగుల 7 05 అంగుళాల దూరం విసిరి ఒలింపిక్ బంగారు పతకాన్ని గెలుచుకుంది. ఈవిధంగా ఒలింపిక్స్ చరిత్రలో ప్రప్రథమంగా భార్యా భర్తలు ఇద్దరూ బంగారు బహుమానాలను గెలుచుకున్నారు.

వాటర్ పోలోలో హంగేరీకి చెందిన జెసో కయార్‌మాటి మూడు బంగారు పతకాలను జయించాడు. ఇందులో మొదటిది 1952 ఒలింపిక్స్ క్రీడలలో లభించింది. ఇతడి భార్య 200 మీటర్ల బ్రెస్ట్‌స్ట్రోక్‌లో బంగారు పతకాన్ని పొందింది. తరువాత 20 ఏళ్ళకి వారి కుమార్తె ఆండ్రియా 100 మీటర్ల బ్రెస్ట్ స్ట్రోక్‌లో వెండి పతకాన్ని పొందింది

స్వీడెన్‌లో గుర్‌నార్, బెర్టిల్, కుంట్ నార్డెహి అనే ముగ్గురు అన్నదమ్ములు 1948 ఒలింపిక్స్ క్రీడలలో ఫుట్‌బాల్ పోటీలో బంగారు పతకాలను పొందారు.

ముగ్గురు రష్యన్ సిస్టర్లు 1960 మరియు 1964 ఒలింపిక్స్ క్రీడలలో 5 బంగారు పతకాలను గెలుచుకున్నారు.

1952 హెల్‌సింకీ ఒలింపిక్స్ క్రీడలలో 19 సంవత్సరాల వయస్సుగల ఫ్రాన్స్‌కి చెందిన జీన్ బొయిటెక్స్ ఒలింపిక్స్ ఈతల పందెంలో 4 నిమిషాలు, 37 సెకండ్లలో ఈది వందాన్ని గెలిచి బంగారు పతకాన్ని గెలుచుకున్నాడు ఇతడి తండ్రి ఇతడిని అభినందించడానికి బయలుదేరి స్విమ్మింగ్ పూల్‌లో పడిపోయాడు. మొట్టమొదట అతడిని రక్షించడం బొయిటెక్స్ ప్రథమ కర్తవ్యం అయింది

1960 ఒలింపిక్స్ క్రీడలలో 19 సంవత్సరాల వయస్సుగల అనితా లెన్స్‌బరో ఈత పందెంలో 2 నిమిషాల 49.5 సెకండ్లలో ఈది బంగారు పతకాన్ని గెలుచుకుంది. నిజానికి ఈమె ఫినిష్‌ని వ్రేళ్ళతో ముట్టుకుంది అంతే

1928 ఒలింపిక్స్ క్రీడలలో నార్వేకు చెందిన 14 సంవత్సరాల ఫ్రోకిన్ సోన్‌జా హెన్నె స్కేటింగ్‌లో బంగారు పతకాన్ని గెలుచుకుంది. 1932 మరియు 1936 ఒలింపిక్స్‌లో కూడా వరుసగా ఈమె బంగారు పతకాలను గెలుచుకుంది

(మిగతా 48 వ

"రేపు చేద్దాం అనుకునేది మనం ఈరోజే చేస్తే ప్రపంచం ఎంత అద్భుతంగా మారిపోతుందో."

# నేరపరిశోధక విధానాలు

డా. పద్మపాణి మహంతా

కొన్ని నేరపరిశోధక విధానాలు చాలా ఆసక్తి దాయకంగాను, ఆశ్చర్యకరంగాను ఉంటాయి.

కిడ్నాపింగ్ కేసు: హోలీ పండుగ ఉత్సవ దినాలలో సంజయ్ అనే 9 సంవత్సరాల అందమైన బాలుడు స్నేహితులతో అస్సాం లోని టిన్‌సు కియాలో ఆడుకుంటూంటే 1975 మార్చి 26న ఎవరో అపహ రించుకుపోయారు. అపహర్తకులు సంజయ్ తండ్రికి మూడు లక్షల రూపాయలు బంధ విమోచన సొమ్ము ఇచ్చి కొడు కుని విడుదల చేసుకోమని ఒక ఉత్తరం వ్రాసారు ఎన్నో సార్లు దబాయిస్తూ తండ్రికి ఫోన్ చేశారు. ఈ సమయంలో పోలీసులు కూడా రంగంలోకి ప్రవేశించారు డిగ్బాయ్‌లో ఈవిధంగా పబ్లిక్ ఫోన్ బూత్ నుంచి ఫోను చేస్తూంటే హెన్రీ రాబర్ట్‌ను పోలీసులు అరెస్ట్ చేశారు. అతడు అన్ని విషయాలు ఒప్పేసుకుని నిజం చెప్పేశాడు సంజయ్‌ను పాతిపెట్టిన చోటికి పోలీసులను తీసుకువెళ్ళాడు. అక్కడ పోలీసువాళ్ళకి ఒక పుర్రె, ఎముకలు లభించాయి పోలీసులు ఈ పుర్రెను, ఎముకలు, వారు వ్రాసిన ఉత్తరం, అపహర్తకులుఇచ్చిన టెలిగ్రాం, హెన్రీ రాబర్ట్ వ్రాత స్పెసిమన్ అన్నీ స్టేట్ ఫోరెన్సిక్ సైన్స్ లాబోరేటరీకి పంపారు

దిబ్రుఘర్ సెషన్స్ కోర్టు విచారణ సమయంలో కూడా రాబర్ట్ నిజం చెప్పేసాడు కానీ నేరం చేసినట్టు ఒప్పుకోలేదు ఫోరెన్సిక్ నిపుణులు పరీక్షించి హెన్రీ రాబర్ట్ టెలిగ్రాం ఇచ్చినట్టు, ఉత్తరం వ్రాసినట్టు నిర్ణయించారు దిబ్రుఘర్ సెషన్స్ జడ్జి హెన్రీ రాబర్ట్‌కి, ఇతర నిందితుడు సునీల్ బిస్వాస్‌కి ఉరిశిక్ష వేసారు. అప్పీల్‌లో తీర్పు ఆమోదించబడింది.

బ్రౌనింగ్ పిస్టల్‌తో పేల్చిన బుల్లెట్: 1978 వేసవి రోజు. ఒక చిన్న ప్రశాంతంగా ఉండే ఊరిలో ఒక పోలీస్ ఆఫీసర్‌ని అతడి గదిలో ఎవరో పిస్టల్ పేల్చి చంపేశారు. మరణించిన పోలీసు ఆఫీసరు శరీరంలో నుంచి తీసిన గుండును పరిశీలించి బాలిస్టిక్స్ నిపుణులు 9 మి మీ బ్రౌనింగ్ పిస్టల్ నేరంలో ఉప యోగింపబడిందని నిర్ణయించారు. ఈ ఆచూకీతో పోలీసు వాళ్ళు ఊళ్ళో ఒక వ్యాపారిని అరెస్ట్ చేసి పట్టుకున్నారు ఇతడి దగ్గర వీరు పట్టుకున్న 9 మి.మీ బ్రౌనింగ్ పిస్టల్‌ని ఫోరెన్సిక్ సైన్స్ లాబొరేటరీకి పంపారు. మరణించిన వారి శరీరంలో నుంచి తీసిన బుల్లెట్ మీద గుర్తులు, పిస్టల్ మీద గుర్తులు పరిశీలించి ఆ వ్యాపారి బ్రౌనింగ్ పిస్టల్‌తో కాల్చి చంపినట్టు బాలిస్టిక్స్ నిపుణులు నిర్ణయించారు.

భార్య అకస్మాత్తుగా మరణించింది: మరో సంఘటనలో క్రొత్తగా పెళ్ళి చేసుకున్న వధూ వరులు హనీమూన్‌కి ఒక కొండ విడిదికి వెళ్ళారు అక్కడ భార్య అస్వస్థతతో అకస్మా త్తుగా మరణించింది. ఆమె కళేబరాన్ని అక్కడే పూడ్చిపెట్టారు. ఆమె బంధువులు ఇందులో ఏదో తప్పు తంటా ఉందని కంప్లయింట్ దాఖలుచేశారు. చివరికి మూడు నెలల తరువాత ఆ మృతకళేబరాన్ని త్రవ్వి తీసారు. ఆమె శరీరంలోపల ఉదరంలో ఉండే విస్కెరాని ఫోరెన్సిక్ సైన్స్ లాబొరేటరీకి పంపారు. అక్కడ నిపుణులు పరీక్షించి తీవ్ర విషకరమైన కీటక నాశిని మందు ఉన్నట్టు నిర్ణయించారు.

"సమాజం నేరాలను నిర్మిస్తే, నేరస్థుడు నేరాలను ఆచరిస్తాడు."

స్కూటర్‌కి ప్రమాదం కలిగించి స్కూటరిస్టుని చంపిన బండి: ఒకసారి ఒక వాహనం స్కూటర్ మీద ప్రయాణం చేస్తూన్న వ్యక్తిని పడత్రోసి చంపి వేగంగా వెళ్ళిపోయింది పోలీసులు, ఫోరెన్సిక్ నిపుణులు నేరం జరిగిన ప్రదేశానికి వచ్చి రంగంలోకి దిగారు ఎక్కడో ప్రమాదం సంభవించిన ప్రదేశానికి 200 కి మీల దూరంగా ఒక వాహనం మీద వీరికి అనుమానం వచ్చింది నేరం సంభవించిన చోట టైర్ గుర్తులు, వాహనం చక్రాలకు ఉన్న టైరు మీది గుర్తులు పరిశీలించారు అపాయం జరిగిన చోట దొరికిన గ్లాసు ముక్కలు, వాహనం ముందు పగిలిపోయిన హెడ్ లాంప్ గ్లాసులు సరిపోల్చి వీటిని అన్నిటినీ పరీక్షించి ఆ వాహనమే ప్రమాదానికి ముఖ్యకారణం అని తేల్చారు

ఈ కేసులన్నీ కూడా సైన్స్ లేక విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందడం వల్ల నేరాలను ఏవిధంగా పరిశోధించవచ్చో తెలుస్తుంది అసలు మొట్ట మొదట ఇంజన్ నెంబరు తెలుసుకోవడం, నేరం చేయడానికి ఉపయోగించిన ఉపకరణాలు, ఇతర ఆయుధాలు పరిశీలించడం, హత్యలలో, అత్యాచారాలలో, వివాదగ్రస్తమైన పితృత్వం (తండ్రిని నిర్ణయించటం), బ్లడ్ గ్రూపింగ్స్ వల్ల తెలుసుకోవచ్చు. ఫోర్జరీ చేసిన లాటరీ టిక్కెట్లు, కరెన్సీ నోట్లు తెలుసుకోబడుతున్నాయి, దొంగ సంతకాలు తెలుసుకోబడుతున్నాయి. రసాయనిక విశ్లేషణ, మందుల మరియు మద్య పదార్థాలు విశ్లేషణ, వివిధ ఫైర్ ఆరమ్స్ పరిశోధన, మామూలు హత్యలు, ఆత్మహత్యలు తెలుసుకోవడం మొదలైనవన్నీ విజ్ఞానశాస్త్రాధారంగా పరిశోధించవచ్చు.

నేరస్థులు ఎప్పుడూ వైజ్ఞానిక శాస్త్రజ్ఞుల కంటే ఒక అడుగు ముందే ఉంటారు అంటారు. కాని క్రొత్త క్రొత్త సాధనల వల్ల, ఖచ్చితమైన నాజూకు పరికరాల వల్ల నేరపరిశోధన చాలా సులభం అవుతూంది నేరస్థులు సులభంగా పట్టుబడిపోతున్నారు ●

## ఆసియా మరియు పసిఫిక్ ప్రాంతాలలో అడవుల కొట్టివేత



ఆసియా మరియు పసిఫిక్ ప్రాంతాలలో అటవీ ధ్వంసం సంవత్సరానికి సుమారు 2 మిలియను హెక్టేరులు

— 'యునైటెడ్ నేషన్స్' సౌజన్యంతో

( 46 వ పేజీ తరువాయి)

యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన ఆవెరీ 10 బంగారు పతకాలను గెలుచుకున్నాడు. అన్నిటి కంటే అద్భుతం ఇతడి బాల్యం అంతా వీల్ చెయిర్‌లోనే గడిచింది ఇతడికి పక్షవాతంతో కాళ్ళు పడిపోయాయి ఆనాడు వైద్యులు ఇతడు జీవితంలో ఇక నడవలేడని చెప్పారు నుంచుని నడవడానికి తనంతట తానే ఇతడు ఒక సాధనాన్ని కనిపెట్టాడు. దాంతో క్రమంగా నడవడం అభ్యాసం చేసుకుని కాళ్ళకు బలం చేకూర్చుకున్నాడు. జంపింగ్‌లో నైపుణ్యాన్ని సాధించాడు కాళ్ళలో స్ప్రింగులు ఉన్నాయా అనిపిస్తుంది!

— 'హర్యానా రివ్యూ' సౌజన్యంతో

"ప్రశ్నించుకుని బ్రతుకుబాటలో పయనించినవాడికే
పరమ సౌఖ్యం ప్రాప్తిస్తుంది."

# శత్రువుని మిత్రునిగా ప్రేమించు

వి.ఎన్.నాయక్

వింతగా కనిపించవచ్చు శత్రువుని ప్రేమించడం? చిక్కు సమస్యే కాదు కాదు నమ్మండి. ఒక్కసారి ప్రయత్నించి చూడండి ఈ సిద్ధాంతం అద్భుతంగా పరిణమిస్తుంది. ఎంతో అనుకూలవంతంగా ఉంటుంది.

అసలు విరోధులు అనేవాళ్ళు లేరనే అదృష్టవంతులలో నీవు ఒకడవు అయితే జీవితంలో నీవు అందరినీ ప్రేమిస్తున్నావనే అర్థం కానీ శత్రువులు ఉన్నవారు మాత్రం నేను చెప్పేది జాగ్రత్తగా వినండి ప్రేమ ఉండేచోట జీవితం ఉంటుంది ద్వేషం అనేది విధ్వంసానికి మూలం, ప్రపంచంలో ప్రేమ అనేది ఒక బ్రహ్మాండమైన శక్తి అయినా ఊహకు అందని అణకువతో, వినయంతో కూడి ఉంటుంది అయితే నీ శత్రువుని ప్రేమిస్తే అతడి చిత్తం చలించకపోదు. అతడి మనస్సు అతి సులభంగా నీ దారిలో పడేటట్లు మళ్ళింపచేసుకుంటావు

ప్రేమ అనే అద్భుతమైన మహాస్త్రంతో పెద్ద పెద్ద యుద్ధాలు ఎన్నెన్నో జయింపబడ్డాయి అని నీకు తెలుసా! మందుగుళ్ళతో, ఆయుధాలతో, మారణాయుధాలతో పొందిన విజయంకంటే ప్రేమ, ఔదార్యాలతో పొందిన విజయం, సహనంతో కూడిన ఘనవిజయం. శత్రువులలో వివిధ రకాల శత్రువులు, విరోధులు ఉంటారు. వీరి మధ్య తేడాలను తెలుసుకోవడం మానవ జీవిత నైపుణ్యం - విసిగి వేధించే శత్రువులు, అనుకోకుండా ఏర్పడే విరోధులు, సృష్టించుకున్న విరోధులు, వ్యాపార విరోధులు, ద్వేషవైరాలు వగైరా ఎన్నెన్నో రకాల విరోధులు ఉంటారు. వీరందరిలోను నీతో వాస్తవంగా



విరోధిగా ఉండకూడదని అనుకునే విరోధే సామాన్యం. ఇటువంటి వారికి ప్రత్యేకంగా నీమీదే కాదు, ఎవ్వరి మీదా కోపం ఉండదు, ప్రపంచం మీద వైరుధ్యంతో ఉంటారు ఆ పరిధిలోనే నీవు తిరుగుతూంటావు. తత్ఫలితంగా అతడి విఫలతకు గురిఅవుతావు

ఒక చిన్న ఉదాహరణ చెబుతాను, చదవండి. పొట్టిగా, నల్లగా, ఉంగరాలు తిరిగిన జుట్టుతో బాగా లావుగా బలిసిన బాలుడు ఒకడు నా చిన్న తమ్ముడి క్లాసులో చదువుతున్నాడు. వాడిని అందరూ 'కింగ్‌కాంగ్' అని ఎగతాళి చేస్తూండేవారు నా తమ్ముడు అప్పుడే ప్రైమరీ

"ఎంత చేదుగా ఉన్నా నిజం నిజమే."

స్కూలు నుంచి సెకండరీ స్కూలులో చేరాడు. క్రొత్తగా చేరాడు కాబట్టి 'కింగ్ కాంగ్' మావాడిని వేధిస్తూండేవాడు కొంచెం సిగ్గు స్వభావం కలవాడు కాబట్టి మావాడు ప్రతీరోజూ ఏడుస్తూ ఇంటికి వచ్చేవాడు స్కూలుకు కొత్త అవడం వల్ల క్రొత్త స్నేహితుల వల్లనేమో అనుకుని ధైర్యం చెప్పి ఉత్సాహం కలిగిద్దామని 'ఒరే తమ్ముడూ మనం ఒక పార్టీ చేసుకుందాం - కేక్, ఐస్‌క్రీమ్, స్వీటూ, సోమాసాలు, బెలూనులతో మీ స్నేహితులను అందరినీ ఆహ్వానించు' అన్నాను. కేక్, ఐస్‌క్రీమ్ అనడం తోటే ముఖం వికసించింది స్నేహితులనడం తోటే కళ్ళలో నీళ్ళుతిరిగాయి 'నాకు ఎవరూ స్నేహితులు లేరు నాకు అందరూ విరోధులే' అన్నాడు

నేను కాసేపు ఆలోచించి అయితే విరోధుల పార్టీ పెట్టుకుందాం - నీ విరోధులందరినీ పార్టీకి పిలు వాళ్ళందరికీ ఐస్‌క్రీమ్, కేక్ పెడదాం, స్వీటు ఇద్దాం, బెలూనులు అందరికీ ఇద్దాం' అన్నాను మా తమ్ముడు ఏదో ప్రశ్నార్థకంగా చూడడం ప్రారంభించాడు

పార్టీ చేసుకున్నాం. అది బ్రహ్మాండంగా జరిగింది. వచ్చిన వాళ్ళందరూ ఎంతో ఆనందించారు. కింగ్‌కాంగ్ సంతోషంగా నవ్వడం ప్రారంభించాడు. అప్పటి నుంచి కింగ్‌కాంగ్, నా తమ్ముడు గొప్ప స్నేహితులుగా మారిపోయారు. ఎవ్వరూ మావాడి జోలికి పోయేవారుకాదు లేకపోతే కింగ్‌కాంగ్ వారిని ఊరికే వదిలేవాడు కాదు

నిజంగా కొన్నిరోజుల తరువాత అతడి తండ్రి నన్ను చూడడానికి వచ్చాడు తన కొడుకుని పార్టీకి పిలిచినందుకు ఎంతో సంతోషమని, ఇంతవరకు ఎవరూ వాడిని పార్టీకి పిలువలేదని చెప్పాడు కాబట్టి అసలు ఇక్కడ సమస్య ఏమిటంటే కింగ్ కాంగ్ ఎవరినీ ద్వేషించలేదు. ఎవరూ తనని చేరనివ్వరని కోపగించుకునేవాడు. ప్రేమ అతడిలో ఒక మార్పు తీసుకువచ్చింది ఇప్పుడు కింగ్‌కాంగ్ మామూలు వాడిగా తయారయ్యాడు.

మీ విరోధులతోనే కాదు, నీవు ఉద్యోగం చేసే చోట కూడా ప్రేమవల్ల అద్భుతాలు జరుగుతాయి మానవుని జీవితంలో ముఖ్యమైన అభిలాష లేక కోరిక అతడు చేయగలిగినది చేయనివ్వడం. నువ్వు ప్రేమాభిమానాలతో మీ తలిదండ్రుల దగ్గర, మీ చిట్టి తమ్ముళ్ళు, చెల్లాయిల దగ్గర మానవసంబంధమైన సత్సంబంధాలను వృద్ధి చేసుకోవచ్చు

మన దేశపిత మహాత్మాగాంధీ జీవితంలో పరమసిద్ధాంతం ఇదే - నీ విరోధిని ప్రేమించడం. జీవితంలో అతడు ఎవ్వరినీ ద్వేషించలేదు. దేనినీ ద్వేషించలేదు - ద్వేషాన్ని తప్ప. మన దేశాన్ని కొల్లగొట్టిన ఆంగ్లేయులను కూడా ద్వేషించలేదు. 'నా చేతిలో ఏ ఆయుధంలేదు, ఇతరుల మీద అధికారం చలాయించడానికి ప్రేమ తప్ప' అనేవారు కానీ మనందరికీ తెలుసు వారు ఎంత అధికారం చలాయించారో, ఎంత మంది మన్ననలను పొందారో.

## ఇంగ్లీష్ ఛానల్ ఈదిన మిక్కిలి చిన్న యువకుడు

***1979 ఆగస్టు 7న 12 సంవత్సరాల వయస్సు గల లండన్ (ఇంగ్లండ్)లో గ్రీన్‌విచ్‌కు చెందిన మార్కస్ హూవర్ ఇంగ్లండ్ మరియు ఫ్రాన్స్‌లను కలిపే అట్లాంటిక్ మహాసముద్రపు పాయ ఇంగ్లీష్ ఛానల్‌ను ఈదిన మిక్కిలి చిన్న యువకుడు. ఛానల్‌ను ఈదడానికి ఇతడికి 14 గంటల 37 నిమిషాలు పట్టింది.***

# అవీ-ఇవీ

## చౌకగా దొరికే మాంసకృత్తులు

ఒక బ్రిటిష్ ఫీడ్ ప్రాసెసింగ్ ప్లాంట్ బృహత్తర సాంకేతిక ప్రగతిమార్గాన్ని అనుసరించి చెట్ల ఆకులు మరియు వివిధ సస్య వ్యర్థ పదార్థాలను మాంసకృత్తులుగా పరివర్తించి పశువుల మేతను ఉత్పాదించింది. విభిన్న పరివర్తన విధానంలో గంటకు ఉపయోగించిన 9 టన్నుల ఆకుల నుండి నాల్గవ వంతు టన్ను ఆకుల సంబంధమైన మాంసకృత్తులు, 2 2 టన్నుల గ్రాస్ పెల్లెట్లు (Grass Pellets), మరియు మూడవవంతు టన్నుల మొలాసెస్‌లు లభిస్తాయి.

## శస్త్రచికిత్స చేయకుండా ప్రేగుల రక్తస్రావ నిరోధం

యు ఎస్ ఎస్ ఆర్ మాస్కోలో వైద్య నిపుణులు గాస్ట్రోఇంటెస్టినల్ (ప్రేగులలో) రక్తస్రావాన్ని క్రొత్తగా శస్త్రచికిత్సను అవలంబించకుండా అరికట్టే ప్రావీణ్యతను సాధించారు. ఒక చివర ఆప్టికల్ (చూడడానికి వీలైన) సాధన తగిలించిన ఫైబ్రో గాస్ట్రోస్కోప్ అనే వంచటానికి వీలుగా ఉండే మెత్తటి గొట్టాన్ని నోటి ద్వారా రోగి కడుపులోకి పంపబడుతుంది రక్తస్రావం తెలుసుకున్న తరువాత జైవిక బంక (biological glue) ఈ గొట్టం ద్వారా కడుపులోకి పంపబడుతుంది. కేవలం 15 నిమిషాలు పట్టే ఈ విధానం వల్ల రక్తస్రావం పూర్తిగా నిలిచిపోతుంది. గాయపడిన కణజాలం అతి శీఘ్రంగా మానుతుంది.

## 3,500 కి.మీ.ల సస్యప్రదేశం

చైనాలో మానవ నిర్మితమైన గ్రేట్ వాల్ అంతరిక్షం నుంచి చూడవచ్చు. త్వరలోనే ఆఫ్రికాలో కూడా ఇటువంటిది అతి సున్నిత వాతావరణ పరిస్థితులు గల సుమారు 3,500 కి.మీ.ల ప్రదేశం సస్యసంపదతో నిండి ఉంటుంది. సస్య సంపదతో నిండిన ప్రదేశం భూమిని సుస్థిరం చేస్తుంది. జపాన్ ప్రభుత్వ వ్యవసాయ శాఖ క్షీణించిపోతూన్న చాడ్ (Chad) సరస్సు మరియు సెనెగల్ నదికి మధ్యగల ప్రదేశాన్ని సస్యభరితం చేయడానికి ప్రయత్నిస్తూంది. ఈ పథకానికి సుమారు 11 బిలియన్ డాలర్లు (11,000 మిలియన్ డాలర్లు) ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది

## గోడల కాలుష్యాన్ని ప్రదర్శించే సాధనం

సోవియెట్ యూనియన్‌లో విక్టర్ కొనియు ఖోవ్ అనే ఆరోగ్య శాస్త్ర నిపుణుడు (Hygienist) ఒక ఫౌంటెన్ పెన్ లాంటి సాధనను కనిపెట్టాడు. ఇది వాస్తవంగా ఒక రీఏజెంట్ నింపిన పిచికారీ ఇటువంటి పెన్నుతో గోడ మీద వ్రాసినప్పుడు వెంటనే కనిపించే గీత గోడలో కాలుష్యాన్ని (Wall Pollution) తెలియజేస్తుంది. ఇది ముఖ్యంగా ఆపరేషన్ థియేటర్లలోనూ, పెద్ద పెద్ద హొటళ్ళలోనూ గోడల కాలుష్యాన్ని (Wall Pollution) తెలుసుకోడానికి వినియోగపడుతుంది

## ఫ్లైట్ టెస్టులకు ఉదజని ఉపయోగం

ప్రకృతిలో జీవావరణ రీత్యా నిష్కల్మషంగానూ, మిక్కిలి అధిక కార్యసాధకంగానూ ఉండే ఉదజని (Hydrogen)ను ఇంధనంగా వాడిన మొదటి వైమానిక ప్రయోగాలు ప్రారంభమైయాయి. కలోరీల విలువ ప్రకారం ఏవియేషన్ కిరసనాయిలు కంటే ఉదజని మూడు రెట్లు ఉత్తమమైనది. విమానం ప్రత్యేకంగా అగ్ని మరియు విస్ఫోటక నిరోధకంగా తయారు

"సమయానికి సముచిత చర్యలు తీసుకోకపోతే
అనూహ్యమైన పరిణామాలు సంభవిస్తాయి."

చేయబడింది ఇంధనం ఉంచే టాంక్ విభాగం నుండి ప్రయాణీకులు కూర్చునే కంపార్ట్‌మెంట్‌కి గాలి చొరకుండా వేరుచేయబడింది. ఇది నత్రజనితో నింపబడింది దీనివల్ల నెరుసులు బయలుదేరవు విమానంలో వివిధ విద్యుత్ విధానం న్యూమాటిక్‌ల (Pneumatic) తో అమర్చబడ్డాయి

## ఎనిమిది కాళ్ళ రాబోట్

సోవియెట్ శాస్త్రజ్ఞులు కనిపెట్టిన 8 కాళ్ళ రాబోట్ గోడలమీదికి, పైకప్పుల మీదికి సులభంగా ఎక్కుతుంది దీనికి ఒకటి పైన, మరొకటి క్రింద రెండు ప్లాట్‌ఫారంలు ఉంటాయి. ఇవి ఒకదానికొకటి సాపేక్షికంగా తిరుగగలవు. ప్రతీదానికి రెండేసి జతల కాళ్ళు ఉంటాయి. రాబోట్ నాలుగు కాళ్ళు గోడను పట్టిఉండగా మిగతా నాలుగు ముందుకు జరుగుతాయి. ఈ విధంగా ఇది నడుస్తుంది.

ఈ రాబోట్ మొట్టమొదట అగ్నిమాపక సేనలకు ఉపయోగింపబడింది. మంటలలో చిక్కుకున్న వారికి ఇది రక్షక దుస్తులను, ఇతర వస్తువులను అందిస్తుంది పెద్ద పెద్ద ఇంధనపు టాంకులను పరీక్షిస్తుంది, ఓడల (hull) భాగాలను శుభ్ర పరుస్తుంది మరియు అనేక పనులను చేస్తుంది. లోహాన్ని పట్టి కోస్తుంది. ఇంటి గోడలకు పూత పెడుతుంది. పెయింటు చేస్తుంది.

## జైవిక సూచనలు

జైవిక సూచనలు (Biological monitoring) ప్రాణులలో పరిసర కాలుష్య కారకాలు, వాటి కాలుష్య ప్రభావ ప్రమాణాలను తెలియజేస్తాయి. భూమిలో మట్టిపాములను లేక చీమలను పరిశీలించుట ద్వారా భూమిలో ఖనిజ పరిమాణాన్ని తెలుసుకోవచ్చు. సామాన్యంగా విత్తనాల లోను, వివిధ ధాన్యాలలోనూ పాదరస ప్రమాణాన్ని పక్షులు తెలియజేస్తాయి కుక్కలు అనారోగ్యమైన గాలిని సూచిస్తాయి యుఎస్‌ఎలో ఫిలడల్ఫియాలో 1000 కుక్కల గుండె రేడియోగ్రాఫులు వాయు కాలుష్యానికి, ఊపిరితిత్తుల వ్యాధులకు గల సంబంధాన్ని తెలియజేసాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) పరిశీలన వల్ల ప్రపంచంలో పట్టణ ప్రాంతపు జనాభాలో 70 శాతం కాలుష్య వాయువులను పీలుస్తున్నారని వెల్లడి అయింది,

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో ●

## స్టాంపుల కథలు

## విన్సెంట్ వాన్ గోగ్




*1990లో నెదర్‌లాండ్స్ విన్సెంట్ వాన్ గోగ్ స్మారకోత్సవ సందర్భంలో రెండు స్టాంపులను విడుదల చేసింది. 55 సెంట్ల స్టాంపు మీద 1886 - 87లో పెన్సిల్‌తో వేసిన స్వీయ చిత్రాన్ని, 75 సెంట్ల స్టాంపు మీద ప్రసిద్ధి పొందిన 'ది గ్రీన్ వైన్‌యార్డ్' పెయింటింగ్‌ని అచ్చు వేసారు ప్రపంచం అంతటా ఇతడి పెయింటింగులు, డ్రాయింగులు చూస్తే ఇతడు ఎంత ఖ్యాతిని పొందాడో తెలుస్తుంది ముఖ్యంగా ఈ చిత్రాలన్నీ 1880 నుండి 1890 వరకు 10 సంవత్సరాలలో వేసినవే ఇతడు మొట్ట మొదట స్వదేశమైన నెదర్‌లాండ్స్‌లో ఉద్యోగం చేశాడు ఆ తరువాత ఆమరణాంతం ఫ్రాన్స్‌లో నివసించాడు.*

— *కవితా రాయ్*

"చిలికి చిలికి గాలివాన కాకముందే సమస్యలు పరిష్కారం చేసుకోడం శ్రేయస్కరం"

# వంట ఇంటి మెళుకువలు

వంటపాత్రలు, గాజు సామాన్ల విషయంలో కాస్త జాగ్రత్తగా వ్యవహరిస్తే పదార్థాలు చెడిపోవు పాత్రలు శుభ్రంగా ఉంటాయి

1 పాత్ర అడుగున కాస్త వెన్నరాసి పాయసం వండినట్లైతే పదార్థం అడుగంటదు. పైగా పాత్ర శుభ్రం చేయడం సులభం అవుతుంది

2 కోడిగ్రుడ్లతో పాటు నీళ్ళలో చిన్న నిమ్మకాయ ముక్కవేసి ఉడకబెట్టినట్లయితే గిన్నె నల్లగా మరక ఏర్పడకుండా ఉంటుంది

3 అల్యూమినియం గిన్నెలకి పట్టిన మురికి వదలాలంటే వైట్ వినిగర్ కొన్ని చుక్కలు వేసిన నీళ్ళను ఆ గిన్నెలో పోసి మగగబెడితే సరి।

4 గోరువెచ్చటి నీళ్ళలో ఉల్లిపాయ తరిగి ఆ నీళ్ళను గిన్నెలో కొద్దిసేపు ఉంచినా కూడా గిన్నె శుభ్రపడుతుంది

5 అల్యూమినియం గిన్నెలో వండిన ఆహారాన్ని నిలవ ఉంచొద్దు పదార్థం లోహాన్ని తినేసి కల్మషమై అనారోగ్య హేతువవుతుంది.

6 నీళ్ళలో బేకింగ్ సోడా వేసి శుభ్రపరచినట్లయితే ఫ్రైయింగ్ పాన్‌లు, వంట పాత్రలు, పదార్థాలు నిలువ ఉంచిన వాసన వేయవు

7 పొగ పొయ్యిలపై ఉపయోగించే పాత్రల అడుక్కి సబ్బు బాగా రాసి వాడినట్లయితే వాటికి పట్టుకున్న మసి కడిగేటప్పుడు తేలిగ్గా వదులుతుంది

8. గాజు గ్లాసులో వేడి పదార్థాలు పోసే ముందు వెండి చెంచాను ఉంచండి గ్లాసు బీటలు బారదు.

9 నీళ్ళలో కొన్ని చుక్కలు నిమ్మరసంగానీ లేదా మూడు వంతుల నీళ్ళలో ఒక వంతు వినిగర్ గానీ చేర్చి గాజు పాత్రల్ని, గ్లాసులనూ కడిగితే అవి తళతళలాడిపోతాయి.

10 మెత్తటి గుడ్డపై కాస్తంత టూత్ పేస్ట్ వేసి గాజు అద్దాలపై రుద్దినట్లైతే వాటిపై ఏర్పడ్డ గీతలు మటుమాయమవుతాయి.

11 కప్పులకి అంటుకుపోయిన టీ, కాఫీ మరకల్ని ఉప్పులో ముంచిన టూత్ బ్రష్‌తో రుద్దితే మరకలు మాయమై కప్పులు కొత్త వాటిలా మెరిసిపోతాయి.

12 నీళ్ళలో టీ స్పూన్ సోడా బైకార్బొనేట్ వేసి హీట్ ప్రూఫ్ గాజు పాత్రల్ని నానబెట్టినట్లయితే వాటికి అంటుకుపోయిన మడ్డి, జిడ్డు తొందరగా వదిలిపోతుంది

# ఔషధ ప్రపంచం

## హెపాటైటిస్Bకి టీకాలమందు

*ఒకరకం తీవ్రమైన పచ్చకామెర్ల వ్యాధి (జాండీస్) హెపాటైటిస్ Bకి భారీఎత్తుగా టీకా మందు తయారు చేయడం రష్యాలో ప్రారంభమైంది. హెపాటైటిస్ B తీవ్రరూపంలో ప్రారంభించి, కుదరని దీర్ఘవ్యాధిగా పరిణమించి నగటున సంవత్సరానికి ప్రపంచం అంతా 2 మిలియనుమంది జీవితాలను హతం చేస్తూంది సుమారు 200 మిలియను మందికి హెపాటైటిస్B వైరస్ ఉందని ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి అంచనా. ఈ టీకాలవల్ల ఈ వ్యాధిని అంటకుండా నివారించవచ్చు.*

"కలిసి ఉంటేనే కలసివస్తుంది."

# కండ్ల రక్షణ

ఏ వ్యాధికైనా ముదిరిన తరువాత చికిత్స పొందడం కంటే ప్రారంభంలోనే నివారణోపాయాలు సులభం అనే విషయం మీరు గ్రహించే ఉంటారు. కండ్ల విషయంలో ఇది అక్షరాలా నిజం. నీ కళ్ళు నీకు ముఖ్యం కాబట్టి అన్ని విధాల రక్షణోపాయాలను



అవలంబించి నీ కంటిని రక్షించుకోవడం ధర్మం. ముఖ్యంగా సక్రమ కాలావధిని అనుసరించి నీ కండ్లను పరీక్ష చేయించుకుంటూండాలి 'మృగనయని' కళ్ళవంటి ఆరోగ్యవంతమైన విశాలమైన కళ్ళు ముఖానికి ఎంతో అందాన్ని చేకూరుస్తాయి.

బిడ్డ పుట్టీ పుట్టడం తోటే కండ్లను పరీక్ష చేయించమని తల్లిదండ్రులకు వైద్యులు సలహా ఇస్తారు. 40 ఏళ్ళు ప్రాయం వచ్చేదాకా అప్పుడప్పుడు వారి వారి కళ్ళు పరీక్ష చేయించుకోవడం చాలా ముఖ్యం. ఆ తరువాత ప్రతీ సంవత్సరానికి ఒకసారి పరీక్ష చేయించుకోవాలి. దృష్టి బాగా ఉన్నా కంటివైద్యుని అప్పుడప్పుడు సంప్రదించాలి. కండ్లను పరీక్షించి వైద్యులు వారి శరీరాలలో వ్యాధులను కూడా గుర్తించ గలుగుతారు.

ఎప్పుడైనా, ఏమైనా సమస్యలు ఉంటే వెంటనే కళ్ళు పరీక్షించుకోవాలి అలుక్కుపోయినట్టు మసకమసకగా కనిపించడం, కండ్లలో నొప్పి, మెల్లకన్ను లేక తరచు తల నొప్పి మొదలైనవి సాధారణ కంటి వ్యాధులు. కంట్లో ఏదైనా చిన్న లోహపు ముక్కగానీ, గాజుముక్కగానీ పడితే వెంటనే కంటి వైద్యుని చూడాలి. ఏదైనా రసాయనిక మందు కంట్లో పడితే కళ్ళు వెంటనే బాగా నీటితో కడుక్కుని వైద్యుని సలహా పొందాలి

వైద్యుడు మీ కళ్ళను పరీక్ష చేసి కళ్ళజోడు పెట్టుకోమని చెప్పవచ్చు జనం ప్రాచీనకాలం

## నానాటికి పెరిగిపోతూన్న జనాభా

*ప్రస్తుతం ప్రపంచంలో జనాభా ప్రతీ నిమిషానికి 150 చొప్పున పెరిగిపోతూంది అంటే రోజుకి 220,000 మంది సంవత్సరానికి 80 మిలియను మంది ఈ రేటులో జనాభా పెరిగిపోతూంటే 2000 నాటికి జనాభా 6 బిలియను (6000 మిలియను) అవుతుంది ఇదే 2010 నాటికి 7 బిలియను (7000 మిలియను), 2022 నాటికి 8 బిలియను (8000 మిలియను) అవుతుంది ఈ పెరుగుదల ముఖ్యంగా అభివృద్ధి పొందుతూన్న దేశాలలో ఏర్పడుతూంది. నేటి నుండి 100 ఏళ్ళ తరువాత ప్రపంచ జనాభా దగ్గర దగ్గర 10 బిలియను (10,000 మిలియను)తో నిలకడగా ఉంటుందని అంచనా వేయబడింది*

*— 'స్టేట్ ఆఫ్ వరల్డ్ పాపులేషన్ రిపోర్టు' సౌజన్యంతో*

"పరమసత్యాన్ని హృద్గతం చేసుకోడానికి
మనసు సంపూర్ణంగా, స్వేచ్ఛగా ఉండాలి."

నుంచీ కళ్ళకు అద్దాలు వాడుతున్నారు. చైనీయులు 700 సంవత్సరాలకు పూర్వం వీటిని కనిపెట్టారు. 1784 లో బెంజమిన్ ఫ్రాంక్లిన్ బైఫోకల్స్—హ్రస్వదృష్టికి, దూరదృష్టికి కూడా పనికి వచ్చే అద్దాలను కనిపెట్టాడు. నేడు చాలామంది కళ్ళజోళ్ళు పెట్టుకుంటున్నారు.

కొంతమంది కళ్ళజోళ్ళకు బదులు కాంటాక్ట్ లెన్స్‌లు ఉపయోగిస్తారు. కాంటాక్ట్ లెన్స్‌లతో బాగా అందంగా కనిపిస్తామని కొందరి అభిప్రాయం. చురుకుగా ఉండే ఆటగాళ్ళు మొదలైనవారు కాంటాక్ట్ లెన్స్‌లనే వాడతారు వాళ్ళకి కళ్ళజోళ్ళు పెట్టుకోవడం కంటే ఇవే సులభంగా ఉంటాయి. మీ వైద్యుడు చెబుతాడు కాంటాక్ట్ అద్దాలు మీరు పెట్టుకోవచ్చా లేదా అని. అలాటప్పుడు వైద్యుడు చెప్పినట్టు విని అనుసరించు. ఎప్పుడూ కాంటాక్ట్ లెన్స్‌లను నాలుక ఎంగిలితో తడిచేసి పెట్టుకోకు. దాని వల్ల కంటికి ఏదైనా ఇతర వ్యాధులు సంక్రమించవచ్చు.

నీవు కళ్ళజోళ్ళు పెట్టుకున్నా లేకపోయినా తీక్షణమైన కాంతి కళ్ళలో పడకుండా జాగ్రత్తపడు. గాలిలో ఎగిరే వస్తువులు కళ్ళకు తగలనీయకు చలువ అద్దాలు ధరించడం వల్ల తీక్షణమైన కాంతి కళ్ళలో పడదు. కళ్ళను ఎప్పటికప్పుడు పరీక్షించుకుంటే నీ భవిష్యత్తు జీవితంలో అవి నీకు ఎంతో సహకరిస్తాయి.

—'హెల్త్'

## ఆత్మవిజయం

ఇంకొకరితో పోరాడి జయించి విజయం పొందడం కంటే ఆత్మవిజయం పొందడం సర్వోత్కృష్టమైనది. మానవుడు పొందిన ఆత్మ విజయాన్ని పరమాత్ముడు కూడా వేరుగా మార్చలేడు.

—గౌతమ బుద్ధుడు

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్:** 1 (ఎ)డా.జాకీర్ హుస్సేన్ - భారతదేశపు అధ్యక్షులుగా ఉన్నారు, (బి) కింగ్‌జార్జ్ VI -రెండవ ప్రపంచయుద్ధ సమయంలో యునైటెడ్ కింగ్‌డమ్ రాజు, (సి)అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్ - రష్యన్ రచయిత, 1970లో వీరికి సాహిత్యానికి నోబెల్ బహుమానం ఇవ్వబడింది. 2. (ఎ) 1885లో బరోస్ (Burroughs)– యునైటెడ్ స్టేట్స్ (బి) డబ్ల్యు.కె.రాంట్‌జెన్ (జర్మనీ) 1895లో, 3 శబ్దం కంటే కాంతివేగంగా ప్రసరిస్తుంది, 4 జంతువులు వగైరా వాటి చర్మాన్ని శుభ్రం చేసి నింపి కుట్టడం, 5. ఇస్తాంబుల్, 6 కొని లాభానికి అమ్మబడే సరుకులు, 7. ముఖ్యమంత్రి మరియు ఇతర మంత్రాంగం చేరి భాద్యత వహిస్తుంది, 8. తూర్పు హిమాలయా ప్రదేశంలో దక్షిణ సిక్కింలో నామ్‌చీ ఒక పట్టణం.

**మాటల మహిమ:** 1. (బి) శ్రోత్రియుడు, (సి) లోకజ్ఞానం లేనివాడు; 2. (ఎ) విలువ, (బి) అమ్మకము, (సి) బేరము, (డి) అమ్మకపు సరుకు; 3 (ఎ) సంగతి, (బి) పని, (సి) గాథ; 4 (ఎ) కోపము, (బి) చిరాకు, (సి) వేగము; 5 (ఎ) ఆపద, (బి) సంశయము, (సి) ముడి, (డి) మెలిక; 6. (ఎ)మత్తు, (బి)సారాయి, (సి) కపటము, (డి) అందము; 7. (ఎ) గారాబము, (బి)గౌరవము, (సి)గర్వము, (డి) సౌకుమార్యము; 8. (ఎ) ముడి, (బి) గాయము, (సి) గునుపు, (డి) మూటముడి.

**తెలివికి పరీక్ష:** 1. అన్నకు అనుగుణంగా ఉండేవాడు, 2 తలక్రిందులైపోతాడు, 3. అక్షింతలు వేస్తారు, 4 కత్తిమీదిసాము అవుతుంది, 5 చిట్టిబాబు మామయ్య 75 కి.గ్రా.లు, రాము 40 కి.గ్రా.లు, టామీ 10 కి.గ్రా.లు.

"మన నిజ స్థితిని ఉన్నది ఉన్నట్టుగా చూచుకోలేకపోవడమే భయానికి ముఖ్యకారణం."

# కారట్

హెచ్.కె బఖ్రు

కారట్ అమూల్యమైన శాఖాహారం మంచి శక్తివంతంగా శరీరాన్ని శుభ్రపరచే ఆహారం రక్తాన్ని శుభ్రపరచి తిరిగి శక్తివంతం చేసే క్షార సంబంధమైన మూల పదార్థాలు ఇందులో పుష్కలంగా లభిస్తాయి పూర్తిగా శరీరానికి పుష్టిని కలిగించి శరీరంలో ఆమ్లక్షారాల సమతూకాన్ని నిర్వహిస్తుంది



A మరియు C విటమినులు అధికంగా ఉన్న కారట్లలో విటమిను B1 మరియు B2లు కూడా కొద్ది కొద్దిగా ఉంటాయి వీటిపై ఆకులలో B2 అత్యధిక శాతంలో ఉంటుంది లివర్‌లో విటమిను Aగా మారే పసుపు పచ్చని రంగు పదార్థం - కెరోటీన్‌కి ఇవి ప్రకృతి సిద్ధమైన ఆధారం

కార్బోహైడ్రేటులు (పిండి పదార్థాలు), పొటాషియం, సోడియం, కాల్షియం, భాస్వరం, గంధకం, కాలోరీన్, ఇనుము మొదలైన లోహాలు, కొద్ది పాటి అయొడీన్ కారట్ దుంపలలో పుష్కలంగా లభిస్తాయి వీటిలో ఉండే ఖనిజ పదార్థాలు వీటి తొక్కకు చేరువుగా ఉండడం వల్ల వీటికి తొక్క తీయకూడదు

కారట్లలో విటమిను Aతో కూడి క్షారవంతం చేసే ఖనిజాలు ముఖ్యంగా కంటి వ్యాధులకు, ఊపిరితిత్తుల వ్యాధులకు మరియు కీళ్ళ నొప్పులకు ఉపయోగపడతాయి కారట్లు ముఖ్యంగా రక్తహీనత, ఉబ్బసం, జలోదరం (Dropsy), రేచీకటి, మూత్రకోశంలో రాళ్ళు, ఆసిడోసిస్, రక్తవిషం, చర్మం మీది పొక్కుల నివారణకు ఉపయోగపడుతుంది మూత్రం విసర్జించేటప్పుడు కలిగే మంటను తగ్గిస్తాయి శరీర ఛాయను మెరుగు పరుస్తాయి డయాబిటిస్, (మధుమేహం)తో బాధపడేవారు మాత్రం వీటిని ఉపయోగించకూడదు వీటి యందు చక్కెర పాలు అధికం.

(మిగతా 58 వ పే

## 2 గంటలలో 462 కి.మీ.ల ప్రయాణం



*వేగాతీతమైన సూపర్‌ఫాస్ట్ TGV రైలు (ఫ్రాన్స్) ముఖ్యనగరం పారిస్‌లో 7 గంటలకు బయలుదేరి రెండుగంటలలో 462 కి.మీ.ల దూరంలో ఉన్న లాయన్స్ (Lyons) చేరుతుంది ఇది పారిస్ నుంచి లాయన్స్ రైలు మార్గం మీద గంటకు 270 కి.మీ.ల వేగంతో ప్రయాణం చేస్తుంది.*

"ఆత్మవిశ్వాసంతో విర్రవీగే అహంకారి జీవన్మృతుడు."

# రాకాశి క్రాబ్ స్పైడర్

కె. విజయలక్ష్మి

భారతదేశంలోను మరియు ఇతర ఉష్ణ దేశాలలో సామాన్యంగా కనిపించే రాకాశి క్రాబ్ స్పైడర్ కొల్లగొట్టి ఆహారం తినే పెద్దరకం సాలీడు. 20 మి.మీ.ల నుండి 25 మి.మీ ల దీని పెద్ద పరిమాణాన్ని బట్టి, వంకరకాళ్ళతో ప్రక్క ప్రక్కలకు పీతలాగా నడవటం వల్ల దీనికి రాకాశి క్రాబ్ స్పైడర్ అనే పేరు వచ్చింది.



రాకాశి క్రాబ్ స్పైడర్లు గోధుమ రంగులో బల్లపరుపుగా ఉంటాయి. ఇవి ముఖ్యంగా మన ఇళ్ళలో బొద్దింకలను, ఇతర కీటకాలను తింటాయి. ఈ సాలీళ్ళు ప్రత్యేక ఉపాయంతో ఆహారం సంపాదించుకుంటాయి శరీరం బల్లపరుపుగా ఉండటంవల్ల సామాన్యంగా బొద్దింకలు చోటుచేసుకున్న సందులలోను, పగుళ్ళలోను దూరతాయి. వాడియైన కోరలు, వాటి వేగం వేటాడటానికి సహకరిస్తాయి

రాకాశి క్రాబ్ స్పైడర్లు బొద్దింకను వెనుక నుండి పట్టుకుంటుంది కీటకాలు వీటిని కరవకుండా తెలివిగా తప్పించుకుంటాయి కీటకాన్ని పట్టుకున్న వెంటనే బొద్దింక మెడమీద కాటేస్తుంది దాని విషంతో బొద్దింక పడి పోతుంది వెంటనే దానిని తినడం ప్రారంభి స్తుంది శరీరంలో ఉండే జీవరసాన్ని పీల్చేసి మిగిలినవాటిని పారేసుంది.

ఈ స్పైడర్లకు బహుముఖంగా పట్టుకునే చాకచక్యం ఉంది. ఒకదానిని పట్టుకుని దాని జీవరసం పీలుస్తూండగా మరోటి కనిపించి నప్పుడు దీనిని కూడా చంపి పొట్టక్రింద పెట్టుకుంటాయి. ముఖ్యంగా స్పైడర్ పరిమాణం, అది తినే కీటకం పరిమాణం బట్టి చంపి పెట్టుకోగల కీటకాల సంఖ్య ఉంటుంది. వీటి అవయవాలు ప్రత్యేకం ఒకే పరిమాణంగల వాటిని వేటాడి పట్టుకోడానికి అనువుగా ఉంటాయి పెద్ద పెద్ద స్పైడర్లు పెద్ద బొద్దింకలను పట్టు కుంటాయి. కాబట్టి చిన్నవాటితో ఆహారానికి పోటీ ఉండదు.

ఆడ రాకాశి క్రాబ్ స్పైడర్ జతకూడే కాలంలో మగవానితో ఒకేసారి జతకూడినప్పుడు మిక్కిలి అధికంగా పొందే రేతస్సును ప్రత్యేక సంచి వంటి అంగంలో నిల్వచేసుకుంటుంది. ఇది వివిధ కాలాలలో పెట్టిన గ్రుడ్లను ఫలదీ కరణం చేయడానికి ఉపయోగించుకుంటుంది. ఆడవి ఒక సంవత్సరంలో మూడు మొదలు నాలుగుసార్లు గ్రుడ్లనుపెడతాయి

ఒక్కసారి జతకూడిన వెంటనే ఆడది తిండిపోతుగా ఆహారాన్ని తింటుంది కడుపు క్రింద దారంలాంటి శిల్కు వచ్చే వెనుక చివరి

భాగం స్పిన్నరెట్లు (Spinnerets) చాలా చైతన్య వంతంగా పెద్దవి అవుతాయి. ఈ శిల్కు-దారంతో గ్రుడ్ల సంచి (ఎగ్ సాక్) అల్లి అందులో గ్రుడ్లను పెడతాయి

ఈ స్పైడర్లు గూళ్ళు కట్టుకోవు కాబట్టి సాధారణంగా గ్రుడ్ల సంచిని (ఎగ్ సాక్) ఇతర కీటకాలు తినకుండా వాటిని అనేక పొరలతో దళసరిగా చేసుకుంటాయి. ఆడది గ్రుడ్ల సంచిని పిల్లలు పుట్టేదాకా నోటితో గట్టిగా పట్టుకుని ఉంటుంది. ఇవి గ్రుడ్లసంచి అల్లడం ప్రారంభించి చిన్న సాలీళ్ళు పుట్టేదాకా ఆహారం తినవు.

ఒక్కొక్క గ్రుడ్ల సంచి (ఎగ్ సాక్)లో 200 మొదలు 400 గ్రుడ్లు ఉంటాయి చిన్నవి బాగా పెరిగి పెద్దవి అవడానికి తల్లి రక్షణ బాగా ఉండాలి. తల్లి సాలీడు గూళ్ళను రక్షించడమే గాక పిల్లలు కావడానికి సంచులను చింపుతుంది కూడా. ఈ పని అంతా పూర్తి అయిన తరువాత తిరిగి ఆహారం తినడానికి కూర్చుంటుంది మూడు వారాల నుంచి మూడు నెలల లోపల తిరిగి గ్రుడ్ల సంచులు అల్లుతాయి

గ్రుడ్ల సంచి నుంచి తీసిన గ్రుడ్లను కూడా లాబొరేటరీలో ప్రవృద్ధిచేయవచ్చు. ఈ విధంగా పెద్ద ఎత్తున వీటిని పెంచి కీటక నిర్మూలానికి ఉపయోగించవచ్చు

—'సిఐఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో




( 56 వ పేజీ తరువాయి)

కారట్ రసం పిల్లలకు, పెద్దలకు ఆరోగ్య దాయకమైన పానీయం. కంటికి బలాన్ని చేకూరుస్తుంది శరీరంలో సూక్ష్మపొరలను (మ్యూకస్ మెంబ్రేన్) ఆరోగ్యకరంగా ఉంచుతుంది. అరిపోయి గరుకుగా ఉండే చర్మాన్ని మెత్త బరుస్తుంది, నున్నగా ఉంచుతుంది

కారట్ రసం ఆకలి పుట్టిస్తుంది, మంచి జీర్ణకారి పెరుగుదల మందగించినప్పుడు, శరీరబారం తగ్గినప్పుడు, శరీరంలో ఉత్సాహం తగ్గినప్పుడు, జీర్ణకోశ సంబంధమైన వ్యాధులకు ఇది మేలు చేస్తుంది నిద్రలేమి, నురాస్తేనియా, నరాల బలహీనత వంటి నరాల రోగాలకు దివ్యమైన ఔషధంగా పని చేస్తుంది. నోటిలో పండ్లకు బలాన్ని చేకూరుస్తుంది చంటి పిల్లల తల్లులకు ఇవి ముఖ్యంగా క్షీరవర్ధకములు - పాలు పడతాయి

విరేచనాలకు కారట్ సూప్ ప్రకృతి సిద్ధమైన నివారణ శరీరంలో నీటి పరిమాణం తగ్గి డీహైడ్రేషన్ ఏర్పడినప్పుడు ఇది సోడియం, పొటాషియం, భాస్వరం, కాల్షియం, గంధకం మరియు మెగ్నీషియం లోహాలను భర్తీ చేస్తుంది. పెక్టిన్కి ఇది ఒక మంచి మూలాధారం ప్రేగులలో గోడలకు పూతపెట్టి పుండ్లను నివారిస్తుంది.

శరీరం మీద కలిగే పుళ్ళకు కారట్ ఆకులను, తేనె పట్టించి కడితే శుభ్రపడతాయి కారట్ వ్రేళ్ళు, విత్తనాలు మూత్రకోశంలో రాళ్ళను కరిగిస్తాయి కడుపు ఉబ్బసాన్ని తగ్గిస్తుంది.

కారట్లు పచ్చివి కూడా సొలడులలో తినవచ్చు. ఉడకబెట్టి వండి కూడా తినవచ్చు పులుసులు, రసాలు, పానీయాలు చేసుకుని ఉపయోగించ వచ్చు. వీటిని వండడం వల్ల ముఖ్యమైన ఖనిజాలు వ్యర్థమైపోతాయి కాబట్టి పచ్చివిగా వాడడం మంచిది. ●

"నరకానికి బాట చాలా విశాలమైనది,కాని సత్యమార్గం ఇరుకైనది."

# ఆహార వస్తువుల కల్తీలను కనిపెట్టడం ఎలా?

ఆహార వస్తువులను కల్తీచేయడం ఒక నేరం. ఆరోగ్యానికి హాని కలిగిస్తుంది. ఖనిజ తైలంతో కల్తీచేసిన ఆవనూనెను ఉపయోగించిన వ్యక్తికి కంటిదృష్టి పోవచ్చు లేక గుండెజబ్బు రావచ్చు. సున్నితమైన రంపపు పొట్టుతో కల్తీచేసిన మిరపకాయల పొడి తిన్న వారికి ఆరోగ్యం చెడిపోతుంది. అదేవిధంగా కల్మషమైన నీటితో కల్తీచేసిన పాలు త్రాగిన బిడ్డ బాధపడుతుంది. ఈ కల్తీలను ఎలా కనిపెట్టడం? సులభమైన పరీక్షలు ఇంట్లోనే చేసి కల్తీలను కనిపెట్టవచ్చు.

మంచి నెయ్యిగానీ, వెన్నగానీ వనస్పతితో కల్తీచేయబడిందని అనుమానం ఉందా? ఇక్కడ చేసిన కల్తీని సులభంగా తెలుసుకునే ఉపాయం ఉంది. ఒక చెంచాడు నేతిని గానీ, వెన్ననుగానీ తీసుకుని ఒక టెస్ట్‌ట్యూబ్‌లో సమాన పరిమాణం హైడ్రోక్లోరిక్ ఆసిడ్ (ఉదజహరికామ్లం)తో కలుపు. దానికి ఒక చిటికెడు పంచదార కలుపు దీనిని బాగా కొన్ని నిమిషాలపాటు కదుపు. టెస్ట్‌ట్యూబ్ అడుగు భాగంలో ఎరుపురంగు కనిపిస్తే నెయ్యిగానీ, వెన్నగానీ వనస్పతితో కల్తీచేయ బడింది అని తెలుసుకోవచ్చు.

పాలలో నీళ్ళు కల్తీచేస్తే చాలా సులభంగా తెలుసుకోవచ్చు నిలువుగా నున్నగా ఉండే అద్దంవంటి నున్నటి తలంమీద ఒక చుక్క పాలువేస్తే చుక్కలా అలా నిలిచి ఉన్నప్పుడు గానీ లేక మెల్లిగా క్రిందికి జారుతూ తెల్లగా గుర్తు ఏర్పడినప్పుడుగాని పాలు కల్తీలేనివి అని తెలుసుకోవచ్చు. కల్తీచేసిన పాలైతే నిలువ కుండా, శీఘ్రంగా పాలచుక్క జారిపోతుంది. పాల గుర్తు ఏర్పడదు.

వంట నూనెలు ఖనిజ తైలాలతో కల్తీచేసినట్టు అనుమానం తగిలితే 2 మిల్లీలీటర్ల వంట నూనెకు సమాన పరిమాణంలో N/2 ఆల్కహాలిక్ పొటాష్ కలిపి 15 నిమిషాలపాటు ఉడుకుతూన్న నీటిలో వేడిచేసి 10 మిల్లీలీటర్ల నీరు కలుపు. మలినంగా కనిపిస్తే ఖనిజ తైలాలు కల్తీచేసారన్నమాట.

తియ్యని మిఠాయి, ఐస్‌క్రీమ్, షర్బత్ మొదలైనవాటిని ఒక్కొక్కప్పుడు మెటానిల్ ఎల్లో (అనుమతింపబడని కోల్‌తార్ రంగు)తో కలుపుతారు. వీటిని కూడా కల్తీకి పరీక్ష చేయడం చాలా సులభం. రెండు మూడు చుక్కలు కాన్‌సెంట్రేటెడ్ హైడ్రోక్లోరిక్ ఆసిడ్ (నిర్జల ఉదజహరికామ్లం) కొద్దిగా మిఠాయితో కలపండి మజంతా ఎరుపు రంగు ఏర్పడితే మెటానిల్ ఎల్లో కలిపినట్టు తెలుసుకోవాలి

# భారతదేశంలో మొత్తం 1652 భాషలు, మాండలికాలు

*భారతదేశంలో అస్సామీస్, బెంగాలీ, గుజరాతీ, హిందీ, కన్నడ, కాశ్మీరీ, మలయాళం, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం, సింధీ, తమిళం, తెలుగు, ఉర్దూ ముఖ్యమైన భాషలు. 1652 వివిధ భాషలు, మాండలికాలు ప్రపంచంలో మిక్కిలి పెద్ద ప్రజాపాలిత రాజ్యం - భారతదేశంలో వాడుకలో ఉన్నాయి. హిందీ 38 శాతం, తెలుగు 9 శాతం, బెంగాలీ 8 శాతం, మరాఠీ 8 శాతం, తమిళం 7 శాతం, ఉర్దూ 6 శాతం, గుజరాతీ 5 శాతం, కన్నడం 4 శాతం, పంజాబీ 3 శాతం, ఒరియా 3 శాతం, మలయాళం 3 శాతం మాట్లాడతారు*

"ఒడ్డుపై నిలబడి చూచేవారికే సముద్రం ఆనందాన్ని ఇస్తుంది సముద్రంలో మునిగిన వారికి కాదు"

# సన్మార్గ జీవ[illegible]

## కంచి పరమాచార్య

మన మనస్సు, మాట, ప్రవర్తన నిష్కల్మషంగా ఉండాలంటే ఒకటే మార్గం. ఎప్పుడూ సదాలోచనలతో, సత్కార్యాలు చేస్తూండాలి

సమర్థ రామదాసు, తులసీదాసు, అప్పయ్య దీక్షితరు, తాయుమానవర్, పట్టినత్తార్ మొదలైన భక్తులు, తేవారం మొదలైన వాటిని రచించిన వారు అందరూ భగవంతుని భక్తులుగా ఉంటూ మనసులోగానీ, చేతల్లోగానీ, ప్రవర్తనలో గానీ ఏనాడూ ఎట్టి పాపం ఆచరించలేదు



ఒకప్పుడు ఒక వృద్ధ సన్యాసిని మనస్సులో కామాన్ని ఎలా పోగొట్టుకున్నావని అడిగినప్పుడు మనసులో కామం ఉద్భవించినప్పుడు నేను తీరికలేకుండా ఉండడం గ్రహించి కామం దానంతట అదే వెళ్ళిపోయింది అని జవాబు చెప్పాడు. మనస్సు ఖాళీగా ఉంచుకునే మానవుడు వ్యర్థప్రలాపాలు ప్రారంభిస్తాడు. మనం దానికి వశులమైపోతే కామం అనేది సులభంగా మనస్సులో సుస్థిరంగా చోటుచేసుకుంటుంది. మనం సర్వదా అన్ని సమయాలలోను మంచి పనులతో తీరికలేకుండా ఉంటే పాపం దానంతటదే దూరంగా పోతుంది దుస్సంగాన్ని వదులుకోవాలంటే మంచివారితో స్నేహం చేసు కుంటూ సత్సంగాన్ని ప్రవృద్ధిచేసు కుంటూండాలి

పాప చింతన పోవాలంటే నిరంతరం మంచి పనులలో మునిగి ఉండాలి. అప్పుడు మనలో పాపం దానంతట అదే నశించి పోతుంది. ఎప్పుడూ మంచిపనులే చేస్తూ మనస్సుకు తీరికలేకుండా చేసుకో. ఊరికే ధ్యానం చేయడం, జపం చేయడం చాలదు

సుప్రసిద్ధ సంస్కృత కవి అప్పయ్య దీక్షితులు ఒకసారి కంచి శ్రీ వరదరాజస్వామిని గురించి వ్రాస్తూ— "ఇతర కవులు ఎంతోమంది ఉండవచ్చు ఓ పరమాత్మా! నీమీద వారు అతి శీఘ్రంగా ఎన్నెన్నో పద్యాలు వ్రాయగలరు. కాని నేను చాలా మెల్లిగా వ్రాసే కవిని. వారి అదృష్టం కంటే నాది మంచి అదృష్టం. నేను పద్యం వ్రాయాలని యాతనపడుతుంటే ప్రకాశవంతమైన నీ దివ్యస్వరూపం మీద నా మనస్సు ఎంతోసేపు సంచరిస్తూంటుంది."

ఈ విధంగా మంచిచేసే ఉద్యమంతో పాపం దానంతట అదే మన మనస్సులో నుంచి మాయమైపోతుంది. గొప్ప గొప్ప యోగులు, భక్తులు దేవుని కీర్తించేటప్పుడు ఈ విధంగా మనస్సును మంచిమార్గంలో పెట్టుకున్నారు. కాబట్టి పాపానికి దూరంగా ఉండాలంటే పాపం పోవాలనికాదు సదా మంచినే చింతిస్తూ, మంచినే మాట్లాడుతూ, సత్సంగాన్ని ప్రోత్సహించాలి

—'భవాన్స్ జర్నల్' సౌజన్యంతో

"పడ్డవాడెన్నటికీ చెడ్డవాడు కాడు"

# వార్తలు

## అత్యల్ప కాలం జీవించిన పోప్

రోమన్ కాథలిక్ చర్చ్ అధికారిగా పోప్ స్టీఫెన్ II 752 AD మార్చి 24న ఎన్నుకోబడ్డాడు. తరువాత రెండు రోజులలోనే ఇతడు మరణించాడు పోప్‌గా అత్యల్పకాలం జీవించాడు

## భూమి అర్థవ్యాసం



భూమి కేంద్రం నుంచి భూతలం వరకు గల సరళరేఖ (అర్థవ్యాసం) సుమారు 4,000 మైళ్ళు మానవుడు ఇంతవరకు భూమి ఉపరితలం నుంచి రెండు మైళ్ళులోతు గల గనిని త్రవ్వాడు.

## నోటి మరియు గొంతు కాన్సర్ వ్యాధులు అధికం

ప్రపంచంలో ఒక్క భారతదేశంలో నోటి మరియు గొంతు కాన్సరు అత్యధికం - 36 శాతం - ముఖ్యంగా పొగ త్రాగుటవల్ల, పొగాకు నములుట వల్ల సంభవిస్తూంది

## ప్రపంచపు నూనె వనరుల వినియోగం

ప్రపంచం నూనె వనరులలో సుమారు 6వ వంతు ముఖ్యంగా లిప్‌స్టిక్, నైలాన్, క్రొవ్వొత్తులు, పాలిష్, ప్లాస్టిక్ మరియు డిటర్జెంట్‌లు తయారుచేయడానికి వాడబడుతూంది.

## నమీబియా ప్రపంచంలో 171వ స్వాతంత్ర్యరాజ్యం

దక్షిణ పశ్చిమ ఆఫ్రికాలో నమీబియా ప్రపంచంలో 171వ స్వాతంత్ర్య రాజ్యం మరియు ఆఫ్రికాలో 52వ స్వాతంత్ర్య రాజ్యం

## ప్రపంచంలో 'టెహరాన్'లో జీవన వ్యయం అత్యధికం

ప్రపంచంలో టెహరాన్ (ఇరాన్)లో ద్రవ్యోల్బణం (inflation) వల్ల మరియు నిత్యావసర వస్తువుల కొరత వల్ల జీవన వ్యయం అత్యధికం. న్యూయార్క్ నగరం జీవన వ్యయం 100 ప్రాతిపదికగా పరిగణిస్తే టెహరాన్ జీవన వ్యయం 209. ఈక్వెడార్ ముఖ్యనగరం ఖ్వీటో తక్కువ జీవన వ్యయానికి పేరుపడింది

## అండమాన్, నికోబార్ ద్వీపాలలో అన్ని గ్రామాలు విద్యుదీకరణ చేయబడ్డాయి

అండమాన్ మరియు నికోబార్ ద్వీపాలలో (బంగాళాఖాతంలో కేంద్ర పాలిత భాగం) ఉన్న 491 గ్రామాలు అన్నీ సాంప్రదాయక మరియు ఇతర విద్యుత్తు ఉత్పాదనతో పూర్తిగా విద్యుదీకరణం చేయబడ్డాయి.

●

"విచ్ఛిన్న ప్రవృత్తిగల మనస్సు సంకల్ప వికల్పాలతో సతమతమై చెదిరిపోతే దాని ఆలోచనలు, చేష్టలు కూడా పరస్పర వైరుధ్యం కలిగి ఉంటాయి."

# గాంధీజీ హితోపదేశం

విద్యార్థికి: తమ పోషణార్థమే గాకుండా ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకోడానికి జీవితంలో ఒక ముఖ్యధ్యేయాన్ని ఏర్పరచుకోడానికి క్రమశిక్షణను పొంది అభ్యసించడమే ఒక విద్యార్థి యొక్క, విద్యార్థిని యొక్క ముఖ్య ధర్మం చిన్ననాటి నుండే మంచి శీలాన్ని నిర్మించుకోవడం, ఆరోగ్యవంతమైన శరీరంతో మానసిక శక్తులను అభివృద్ధి చేసుకోవడం ప్రతీ యువకుని మరియు యువతి ధర్మం.



కాబట్టి శ్రద్ధగా అధ్యయనం చేస్తూ శరీర ఆరోగ్యాన్ని పదిల పరచుకుంటూ మానసిక శక్తులను పెంచుకోవడమే విద్యార్థుల ముఖ్య కర్తవ్యం. వీరు దేశానికి ఒక అపూర్వ సంపదగా ఉండాలేగానీ, భారంగా ఉండకూడదు. వీరు దేశానికి, తన్మూలంగా సమాజానికి చివరగా మానవజాతికి చేయవలసిన ధర్మం ఎంతో ఉంది. నిర్భయంగా, సాహసంతో, ఉత్సాహంతో జీవిత రంగంలో తగిన పాత్ర వహించి సాంఘికాభివృద్ధికి తోడ్పడాలి. దీని కోసం ఒక్కొక్కప్పుడు వారు తమ చదువులను కూడా త్యాగం చేయవలసి వస్తుంది. అయితే మొట్టమొదట న్యాయా న్యాయాలను వివేకంతో గ్రహించి దానిని సాధించడానికి న్యాయమైన క్రమ విధానాన్ని అనుసరించాలి యువకులు, విద్యార్థులు తమ అద్భుత శక్తులను అపాయకరమైన వ్యతిరేక ప్రయోజనాలకు దుర్వినియోగం చేసుకోకూడదు

స్త్రీకి: స్త్రీ ముఖ్యంగా పురుషునికి పరిపూర్ణతను కలిగించునదిగా గ్రహించాలి. మానవ జీవితాన్ని సుస్థిరంగా నిలబెట్టడానికి పురుష ప్రయత్నంలో స్త్రీ సహధర్మచారిణిగా ఉండాలి కాబట్టి స్త్రీ ఎన్నడూ పురుషునికి వ్యతిరేకంగా ఆచరించకూడదు. పురుషుల మర్యాదను ఆశిస్తే పురుషులకు స్త్రీ మర్యాద ఇవ్వడం నేర్చుకోవాలి. పురుషునితో పాటు సరిసమంగా స్త్రీకి విద్యార్హత, క్రమశిక్షణ తప్పనిసరిగా ఉండాలి. జీవిత రథానికి స్త్రీ రెండవ చక్రం వంటిది

అందరు పురుషులు, స్త్రీలు కూడా శిక్షణలో మొదటి పాఠాలను తమ మాతృ దేవత నుండే పొందుతున్నారనేది గ్రహించాలి కాబట్టి మాతృ దేవతగా స్త్రీ భాధ్యత ఎంతైనా ఉంది.

(మిగతా 64 వ పేజీలో)

## ప్రపంచంలో వృద్ధ పౌరులు

*ప్రపంచంలో 60 కి పైబడిన వయస్సు గల వృద్ధ పౌరుల సంఖ్య అభివృద్ధి పొందుతూన్న దేశాలలో 2001 కి 6.3 శాతం నుంచి 11.9 శాతానికి పెరుగుతుందని అంచనా వేయబడింది. అభివృద్ధి పొందిన దేశాలలో ఈశాతం 15.8 నుంచి 23.6కి పెరుగుతుంది. మొత్తం మీద ఈ పెరుగుదల 13.3 శాతం ఉంటుంది*

— *'హ్యూమన్ రైట్స్ వరల్డ్‌వైడ్' సౌజన్యంతో*

"జిజ్ఞాసలో కాలవ్యవధి ఏర్పడితే ఆటంకాలు, అవాంతరాలు సంభవిస్తాయి."

# మృత్యువు అంటే ఎందుకు భయపడతాం?

జిడ్డు కృష్ణమూర్తి

ఒక చెట్టునుంచి రాలే ఆకు మృత్యువుకి భయపడుతుందా? ఒక పక్షి మృత్యువుకి భయపడుతూ జీవిస్తుందని అనుకుంటావా? మృత్యువు ఎప్పుడు వస్తే అప్పుడు దానిని అది కలుసుకుంటుంది. అంతేగాని మృత్యువును గురించి ఆందోళన చెందదు. కీటకాలను పట్టుకు తింటూ, గూళ్ళు నిర్మించుకుంటూ,



J. Krishnamurti

పాటలు పాడుకుంటూ నిశ్చింతగా జీవించడానికి కుతూహల పడుతుంది వాటంతటఅవి విరామం లేకుండా ఆనందపడుతూన్నట్టు కనిపిస్తాయి వాటికి మృత్యువును గురించి చింతే ఉండదు మృత్యువు ఆసన్నమైందా? రానీ వాటి పని అవి చేస్తాయి. ముందు ఏం జరుగుతుందో అనే ఆందోళన ఉండదు క్షణం క్షణం సజీవంగా ఉంటాయి. మనకే, మనుష్యులకే మృత్యువు అంటే భయం-ఎప్పుడూ భయపడి పోతూంటాం. వృద్ధులు మృత్యువుకు చేరువగా ఉంటారు. యువకులు కూడా దీనికి ఎంతో దూరంలో ఉండరు.

మృత్యుభావంతో మనం నిమగ్నులమై ఉంటాం. ఎందుకంటే మనకు బాగా తెలిసిన దాన్నిగాని, సంగ్రహించి పెట్టుకున్న దాన్ని గాని పోగొట్టుకోడానికి భయపడతాం. చేసుకున్న భార్యనుగానీ, భర్తను గానీ, బిడ్డను గానీ, స్నేహితునిగానీ పోగొట్టుకోడానికి భయపడతాం. మనం తెలుసుకున్న దానిని పోగొట్టుకోడానికి భయపడతాం. సంపాదించుకున్న దానిని పోగొట్టుకోడానికి భయపడతాం. మనం ప్రోగుచేసుకున్న వాటినన్నిటినీ - మన స్నేహితులను, మన ఆస్తులను, సంపత్తులను, మన గుణాలను, శీలాన్ని కూడా తీసుకు వెళ్ళగలిగినప్పుడు మనం మృత్యువు అంటే భయపడం అందుకే మృత్యువును గురించి, దాని తరువాత జీవితాన్ని గురించి, ఎన్నెన్నో సిద్ధాంతాలను సృష్టించుకుంటాం. కానీ అసలు విషయం మృత్యువు అంటే అది అంతం. దీనిని అనుభవించడానికి సమ్మతించం. తెలిసిన దానిని వదలదలచుకోము కాబట్టి తెలిసినదానికి అంటిపెట్టుకుని ఉండడం వల్ల మనలో భయం కలుగుతూంది. అంతే గాని తెలియని దాని వల్ల కాదు తెలియని దానిని తెలిసిన దానితో

## నమ్మలేని నిజాలు

### యుద్ధంలో మరణించాడనుకున్న వ్యక్తి 54 సంవత్సరాలు జీవించాడు

*జనరల్ ఛార్లెస్ డి గాలె అనే ఫ్రెంచి సైనిక నాయకుడిని 1916 మార్చి 2న యుద్ధంలో మరణించాడని అనుకుని అక్కడే వదిలేసారు అయితే అతడు అసలు మరణించలేదు, బ్రతికే ఉన్నాడు. అతడు 1970 లో 54 సంవత్సరాల తరువాత మరణించాడు*

"జ్ఞాపకశక్తి మరల మరల మననం చేయడం వల్ల పుష్టిచెందుతుంది"

గ్రహించలేం కానీ మన మనస్సు తెలిసిన వాటితో ఉండి "నేను అంతం అయిపోతున్నాను" అన్నప్పుడు భయపడిపోతుంది.

తెలిసినదానితో చైతన్యవంతంగా భవిష్యత్తు గురించి ఆందోళన పడకుండా ఇప్పుడు వర్తమానంలో క్షణక్షణం జీవించగలిగితే, రేపు అనే చింత లేకుండా జీవించగలిగితే చిరపరిచయమైన వాటిని వదులుకోగలుగుతావు అప్పుడు నీలో అద్భుతమైన మార్పు ఏర్పడిందని తెలుసుకుంటావు ఒక్క రోజు ప్రయత్నించి చూడు నీకు బాగా తెలిసిన వాటిని, పరిచయమైన వాటిని దూరంగా ఉంచు వాటిని గురించి ఒక్కసారి పూర్తిగా మరచిపో ఏం జరుగుతుందో చూడు. రోజు రోజుకీ, గంటగంటకీ, క్షణక్షణానికీ నీ చింతలను పెరగనీయకుండా అన్నిటినీ పోగొట్టుకో జీవితం, మృత్యువు చేరిన ఈ స్వేచ్ఛతో అద్భుతమైన జీవితాన్ని సందర్శిస్తావు మరణం అనేది ఒకదాని అంతం ఆ అంతంలోనే పునర్జీవనోపాధి ఉంటుంది

## శరీరప్రక్రియకు విటమినుల ఆవశ్యకత

*శరీర ప్రక్రియలు కొన్నిటికి విటమినులు అతిముఖ్యం విటమిను A చర్మానికి రక్ష ముఖ్యంగా కంఠలో చెమ్మగా ఉండే భాగాలు, గొంతులో నన్నని పొర మొదలైనవాటికి దీని అవసరం ఎంతైనా ఉంది వివిధ B విటమినులు మనం తిన్న ఆహారం నుంచి శక్తిని విడుదల చేస్తాయి విటమిను C రక్తంలో ఎర్రరక్తకణాల నిర్మాణానికి సహకరిస్తుంది D విటమిను రక్తంలో ఉన్న కాల్షియం (సున్నం), మరియు భాస్వరంను విడుదల చేసి ఎముకల అభివృద్ధికి సహాయపడుతుంది E విటమిను సంతానోత్పత్తికి సహకరిస్తుంది*

## రోజుకు 42 సార్టీలు చేపట్టిన రికార్డు ఘనత

*హిమాలయా పర్వత ప్రదేశంలో తూర్పు కారాకోరమ్స్‌లో 18,000 అడుగుల ఎత్తున ఉన్న సియాచిన్ - ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన యుద్ధభూమి మీద సైనికులకు సరఫరాలను అందించడానికి గ్రూప్ కాప్టెన్ తాజిందర్ పాల్ సింగ్ సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం దాకా ఒక రోజులో 42 సార్టీలను చేపట్టి రికార్డు స్థాపించాడు.*

*— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో*

( 62 వ పేజీ తరువాయి)

అధికారికి/ఉద్యోగదారుడికి· అధికారైనా, ఉద్యోగదారుడైనా ప్రజానీకానికి సేవ చేయడానికి జీతాలు పుచ్చుకుంటూన్న సేవకధర్మం కంటే విశేష ధర్మం ఉందని గ్రహించాలి ప్రజ వారికి కొన్ని అధికారాలను ఇస్తుంది. వారు ఈ అధికారాలను దుర్వినియోగం చేయకూడదు ప్రజానీకానికి సేవయొనర్చి భాద్యతాయుత ధర్మాన్ని నెరవేర్చాలి ఇదేవారి పవిత్రధర్మం అందుకనే వారిని ప్రజాసేవకులు అంటారు.

వీరే రాజ్యపాలనకు కారకులు చట్టాలను విధిస్తారు. అల్లరులు జరుగకుండా చూస్తారు. ప్రజల సాంఘిక, ఆర్థిక అవసరాలను తీరుస్తారు. కాబట్టి ఒక అధికారిగానీ, ఒక ప్రభుత్వోద్యోగిగానీ ఏ పదవిలో ఉన్నా వారు చిత్తశుద్ధితో నిజాయితీగా ప్రవర్తించాలి ఎటువంటి అనుమానం లేకుండా సీజర్ భార్యలా ప్రవర్తించాలి సామర్థ్యవంతంగా, నేర్పుగా ఉండాలి. తన ముఖ్య ధర్మాన్ని మించి ఎక్కువగా పనిచేయాలి. నిష్పక్షపాత బుద్ధితో, న్యాయంగా, మర్యాదతో ధర్మబద్ధులైన పౌరులను కాపాడుతూ సంఘద్రోహులను శిక్షించాలి.

"ప్రేమ హృదయంలో నింపుకోనంతవరకూ
అందవికారం, దరిద్రం ఆవరించి ఉంటాయి."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

